నమృతత్వము లభింపఁజేసి, కీర్తిప్రకాశముతో వర్ధిల్లఁజేయు ననియు, వ్యాపన శీలమును, జ్ఞానస్వరూపమును, అమృతస్వరూపమును, తేజోమయమును, నగు పరబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరింపఁజేయు ననియు నైహికాముష్మికసుఖప్రాప్తిని సూచించినాఁడు. ఇది గ్రంథమునకు మొదటిశ్లోకము. ఈ పశ్లోకమున స్మరణమాత్రముచేతనే లోకములను బవిత్రీకరించునపు డతనిచరిత్రము కావ్యరూపమున సేవించునపుడు సమస్తపాపములను బోఁగొట్టి నిరామయ శాశ్వతానందసౌఖ్యము లొసంగుటకేమి వింతయని తనయీ కావ్యనిర్మాణ ఫలమునుసూచించినాఁడు. "ఏకోదేవస్సర్వభూతేషుగూఢః...అణోరణీయాన్మహామేవతద్వై...ఏకర్యేవయతోలోకాన్ విసృజామి...... పరిత్రాణాయ సాధూనాం......ఇత్యాది సూక్తులననుసరించి ధర్మసంస్థాపన మొనర్చి లోకపాలనముచేయుటకు రాజుగాఁ బుట్టినసు నలుఁడు కామాదివికారముల వీడి దేవతారాధనాదులచే జ్ఞానమును సంపాదించినవారికి సచ్చిదానందసంధాయకుఁ డగుపరమేశ్వరస్వరూపుఁడే యనియుఁ బైని వ్రాసినయొకశ్లోకమునఁగూడ సూచించినాఁడు. మఱియు రాజుగా నున్న నలుఁడు.

శ్లో. దధతో బహుశైవలక్ష్మతాం ధృతరుద్రాక్షమధువ్రతం ఖగః
స్థపలస్య యయౌ కరం పునః సరసః కోకనదభ్రమాదివ.

బహుశైవలక్షణములు గలిగి రుద్రాక్షమాలాలంకృతము లైన యవయవ సంస్థానవిశేషములు గలమహాశైవుఁ డని యు సూచించి యున్నాఁడు. మఱియు

శ్లో. పురోహతాక్షిప్తతుషారపాండర......అంతఃపురాంతిస్సవిలోక్య బాలాం.
దోర్మూల మాలోక్య............నేత్రేతార్థం ననగ్నాం స్త్రీం.........

అనువారోక్తి ననుసరించినవాఁడును, పరస్త్రీపరాఙ్ముఖుఁడును గా సూచించినాఁడు. రాజాసయజ్వా...దారిద్ర్యదారిద్రణిశౌఘవర్షే...అర్థినామవ్యాపితాఖిల లోమా......తానుయజ్వయై శ్రోత్రియుల పాలుచేసిన సంపద గలయామహామహుఁడు, అధ్వరాజ్యోపమముగా రాజ్యమును విబుధవ్రజాధీనముగానించి దేవతల నారాధించిన కర్మఠచక్రవర్తి యనియు, అర్థులకు బలు దారిద్ర్యవిదారక మగు ద్రవిణవర్షము వర్షించుటలో నమోఘమేఘవ్రతదీక్ష వహించి, యర్థి యని విన్నంతమాత్రమున రోమాంచము వహించెడు మహాదాత యనియు "నాభ్యయాయి భవతేదం రోహిణీరమణవంశభవేన" ఇత్యాది, సత్యశీలుఁ డనియు, అధారి పద్మేషు తదంఘ్రిణా గణా క్వతచ్ఛయచ్ఛాయలవోపి పల్లవే........

# సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.

(పూర్వవర్తి కావ శేషము.)

—: యీ. వేఙ్కటవీరరాఘవాచార్యులుగారు. :—
[అధ్యక్షుడు-'ఆన్ధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు'-విజయనగరము.]

---

XXV. మనోదూతః—18.విష్ణుదాసవిరచితము. ఇతఁడు వంగదేశీయుఁడును, వైష్ణవమతసంస్థాపకుఁడును శ్రీచైతన్యస్వామికి మేనమామ(?) ఇందు 101 మాలినీవృత్తములు గలవు. ఇతఁడు తాను "విష్ణుదాసకవీన్ద్రుఁడ" నని వ్రాసికొనెను. తనభక్తివిశేషముం దెలుప నితఁడు తనమనస్సును శ్రీమహావిష్ణుసవిధమునకుఁ బంపుట యీకావ్యమునందలి వస్తువు.

ఈ కావ్యమునుండి కొన్నిశ్లోకములు ప్రదర్శించెద.

1. శ్లో. నిర్వర్ణ్యతాని రహసి స్వయ మర్జితాని
భూయాంస్తరాణి దురితాని సుదుఃసహాని

---

మహామహోపాధ్యాయహరప్రసాదశాస్త్రి (పూర్వోద్ధృతగ్రంథభూమిక' పుట 4; "భావవిలాస" కారుఁడును, "భ్రమరదూత" కారుఁడు నొక్కఁడే యని-ఆచార్యసతీశచన్ద్రవిద్యాభూషణుఁడు "హైందవన్యాయశాస్త్రచరిత్రము"లో (పుటలు416—17) వ్రాసియున్నాఁడు.

18. "Catalogue of Skt. MSS. in the Indian office Library" Vol.VII Nos.౪౩౨౭—౪౩౪౪. ప్రారంభశ్లోకము, గద్యముకూడఁ గవినామాంకితములు. కలకత్తా "సంస్కృత సాహిత్యపరిషత్తు"లోని వ్రాఁతప్రతులలో నీకావ్యముయొక్క యసమగ్రప్రతి యొకటి గలదు. రాజేన్ద్రలాలమైత్రపండితుఁడు "Notices of Sanskrit MSS." (Vol. II, No. 613) లోఁ జేర్కొనిన "మనోదూత"యు, విష్ణుదాసకృత "మనోదూత"యు నొకటియే యని తోఁచెడి. ఏలన రాజేన్ద్రలాల్ మైత్రుఁ డుటంకించిన కావ్యాంతిమశ్లోకమును, విష్ణుదాసుని కావ్యములోనితుది శ్లోకమును "వసన్తతిలకా" వృత్తములే కాని మొదటికావ్యముయొక్క గద్యము కవినామాన్వితము. దీనిప్రథమలిఖితప్రతి—మాతృక—లోపించుటచే నాద్యశ్లోకము కవినామాన్వితమో కాదో తెలియదయ్యె.

* విష్ణుదాసుని "మనోదూత" శ్రీచిన్తాహరణచక్రవర్తి (M. A.) మహోదయునిచేఁ బ్రకృతము కలకత్తా "సంస్కృతసాహిత్యపరిషత్" పత్రికలోఁ బ్రచురింపఁబడుచున్నది.

(a) "సంస్కృతసాహిత్యపరిషత్తు" XII సంపుటము 3 సంచిక. జూలై 1929; 105—112 పుటలు; భూమిక; 1—27 శ్లోకములు.

(b) "సం. సా. ప." XII సం. 4 సం. ఆగష్టు 1929; 28-62 శ్లో.

(c) "సం. సా. ప." XII సం. 6 సం. అక్టోబర్ 1929. 63—88 శ్లో.

శ్రుత్వాచకాలవిహితాన్యవశేన్ద్రియాణాం
దుఃఖా న్యచిన్తయత వత్సవవిష్ణుదాసః. 1

2 శ్లో. ఇష్టార్థదైః శమదమాదిభిరేవ యోగైః
తీర్త్వా తపోబహువిధం భ్రమతశ్చతీర్థమ్
తత్కింకరోమి వికలోఽహ మితః క్వయామి
త్వేయం విలక్ష్య శరణం హరి మాలలోచే. 2

3. శ్లో. యత్పాదతామరసలాలసమానసాస్తే
భ్రాన్త్యాపి కర్ణ పదవీం నయన్తి సన్తః
బృన్దారకప్రకరమౌలికిరీటకోటి
రత్నాంశురఞ్జితపదం పదమామకేన్ద్రమ్. 3

4. శ్లో. ఏకం త్వమిన్ద్రియగణస్యమనోపరీయః
పారస్థా జగదుపైతి తవప్రశక్త్యా
ఇత్యర్థయే ప్రణతిపూర్వక మానుకూల్యం
నోచేత్కరోషి మమతాదృశమేవ కర్మ. 8

5. శ్లో. సర్వానపాస్య విషయాన్ క్షణమేవతావ
చ్చేతోఽవధేహి కరుణాకణికాం విధేహి
ఆర్తస్తతఃకతిపయాని నివేదయామి
నోచే దరణ్యరుదితం కిమిదం కరోమి. 9

6. శ్లో. జాతః స ఏవ సుకృతీ సఫలం జగత్యాం
తేనైవ రత్నజననీ జగతీజనేన
ఏతద్వ్యపేహి నభఃకుసుమోపమేయం
గేయం సుధీభి రవధార్యపరంపరేతి. 13

7. శ్లో. నవ్యాహతః క్వచనతే విషయస్త్రిలోక్యా
మధ్యానమాబ్దికముపైషి నిమేషతోఽపి
జానాసి మద్వ్యవసితాని మనోవినాత్వా
మాత్రేణ కః కథయ మాతపదేనియోజ్యః. 16

8. శ్లో. ప్రాయఃకుమారికయమానవతీ నయోఢ
ప్రేమ్నా ప్రయాతి పునరస్థిరతాం నవోఢా

తస్మాద్విధేయమిదమేవమనః ప్రయత్నా
ద్విశ్లేషలేశమపి నేయముపైతియస్మాత్. 24

9\. శ్లో. కింవర్ణ మస్య చరణం శ్రవణం శరీరం
నేత్రం మనోఽపి చిరతాజ్జగదేకచిత్రాత్
పఙ్కేనిమగ్నమివ జీర్ణమనేకశంకే
యత్నాన్మనాగపి సముద్ధృతిమానయన్తు. 37

10\. శ్లో. కృష్ణం తమాలతరుకజ్జలభాసి యస్యాః
స్నిగ్ధాఙ్గుజే పయసి సంహృతమమ్బుజాక్షమ్
గోప్యశ్చిరేణ పరితః పరిలోభయన్త్యః
స్పర్శామజాతపులకై రయమిత్యవేయుః. 49

11\. శ్లో. కస్తూరికోమలదళోపరిజృమ్భమాణ
మల్లీశిరీషపరికల్పితచారుతల్పే
ఉన్మద్గముగ్ధకుసుమావలిమాకరన్ద
గన్ధప్రభమద్భ్రమరఝఙ్కృతిసంభృతేఽపి. 64

12 శ్లో. లీలాశ్రమామ్బుచయచుమ్బిత కృష్ణగౌర
తన్వోస్తయోరభిముఖం హరిగోపవధ్వోః
అన్యోఽన్యదేహరుచిరప్రతిబిమ్బయోగా
ద్గౌరో హరిః కిమపి గోపవధూశ్చ కృష్ణా. 66

13\. శ్లో. యాసాంకరేషు కర మీక్షణ మీక్షణేషు
గణ్డేషు గణ్డ మథ రేషు తథాధరఞ్చ
వక్షస్తలేషు హృదయాభి రలీనపక్షః
సమ్మానయన్మనసిజం విజహార కృష్ణః. 70

14\. శ్లో. ఈహామహే నహి మహేన్ద్రపదం ముకున్ద
స్వీకుర్మహే చరణదైన్యముపాగతం వా
ఆశాం పునస్తవపదాబ్జకృతాధివాసామ్
ఆశాస్మహే చిరమియం సకృశా యథాస్యాత్. 82

XXVI మనోదూతః—19. తైలిఙ్గవ్రజనాథునిచే విక్రమశకము 1814 (క్రీ. శ. 1758) లో రచియింపఁబడెను. ఈకావ్యమునకు "సహృదయ

19\. "కావ్యమాల xiii గుచ్ఛము; సంఖ్య 8; (పుటలు 84—18?.)

హృదయాహ్లాదన"మని నామాన్తరము గలదు. దుర్యోధనాస్థానమునకుఁ గేశాకృష్టయై లాగికొనిపోఁబడునట్టి యనన్యశరణ యగు ద్రౌపది తనమనస్సును శ్రీకృష్ణునియొద్దకు దూతగాఁ బంపుట యిందలి వర్ణితవిషయము.

* శ్రీమాన్ కృష్ణమాచార్యులవారు తమ "సంస్కృతసారస్వతచరితము"న నిట్లు వ్రాసియున్నారు. (పుట 128)

"Vrajanatha was the son of Ramakrishna. He was a Tailinga Brahmin of the N. W. Provinces. He wrote his 'Manodutikavya' in A. D. 1758 at Brindatavi. It describes the devout reflections of Draupadi on Krishna during the scene of her outrage at Duryodhana's court. The poem closes with the description of the endless expansion of Draupadi's apparel and the consequent disgrace to the Kaurava princes. The plan of the poem was undoubtedly suggested by the Meghaduta, but it is no bare imitation of Kalidasa's work, nor is it written in the same metre. The ideas are fanciful and appealing, but the style is not so amusing as Kalidasa's."

ఈ కావ్యమున 202 శిఖరిణీవృత్తములు గలవు. వ్రజనాథుడే యీకావ్యమునకు "మఞ్జుభాషిణి" యను నొకటీకను వ్రాసికొనెను. ఈ వ్యాఖ్యాపీఠికాశ్లోకము లిందు రెండు ప్రకృతోపయోగములు.

"శ్లో. స్వయంకృతే మనోదూతకావ్యే భక్త్యేకమానసః
వ్యాఖ్యా బాలావబోధాయ క్రియతే మఞ్జుభాషిణీ.

శ్లో. భూయోభూయః ప్రణమ్యాహం యాచే బద్ధాఞ్జలిర్బుధాన్
బాలభాషితమిత్యేవ క్షమధ్వం చాపలం మమ."

వ్యాఖ్యారంభము:—అథ 'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యఃపరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే' ఇత్యాద్యుక్తం కావ్యఫలం ప్రశ్నన్ సహృదయహృదయాహ్లాదకైరద్భుతకరుణశాన్తరసప్రధానైః సహృదయానాం భగవద్భక్తిరసికానాం మనసి సద్యః సమాస్వాదనసముల్లాసప్రవణం మనోదూతాఖ్యం కావ్యం చికీర్షుస్తస్య నిర్విఘ్నసమాప్తయే శిష్టాచారపరిప్రాప్తం స్వేష్టదేవతాస్మరణగర్భం వస్తునిర్దేశాత్మకమాశీర్వాదాత్మకం చ మఙ్గలముపనిబధ్నాతి:—

1. "శ్లో. దధద్వాసః పీతం సజలజలదశ్యామలరుచి
ర్ముదా పూర్ణాం కుర్వన్నధరసుధయా సన్మురలికామ్
సమన్తాదాభీరీజనపరివృతో భానుతనయా
తటాన్తఃసంచారీ మమ హరతు హారీ హరి రఘమ్. 1

2. మీమాంసాప్రమేయ మాహ:—

శ్లో॥ శ్రుతిం లిఙ్గం వాక్యం ప్రకరణ మథస్థానక మహో
సమాఖ్యాం జానన్తః కలితపరదౌర్బల్యవిధయః
లిఙ్గం ధాత్వర్థం త్రివిధవిధియాదం చ నిగమా
నధ్యాపం మన్వానాః క్రతుసదసి మీమాంసకవరాః. 59

3. వ్యాకరణస్వరూపమాహ: —

శ్లో॥ సముద్భూతం యత్ర జ్ఞగనుకృతౌ పాణినిముఖే
ర్మహాబ్ధేర్జాత్యాయనకృతవిశేషార్థకలనమ్
భుజఙ్గేన్ద్రాధీశోద్భవగహనసద్భాష్యవివృతి
ప్రకృష్టార్థం శాస్త్రం సదసి కథయన్తోఽతిసుధియః 60

4 అథతర్కశాస్త్రీయమాహ-

శ్లో॥ వితణ్డాజల్పాద్యైర్విరహితసువాదోద్ధురగిరః
ప్రమాణైః ప్రత్యక్షాదిభి రపిచ మేయక్రమవిదః
అభావాఖ్యవ్యాప్తిస్ఫురలసితహేత్వచ్ఛవిలస
న్మతిప్రౌఢా వైశేషికమతవిశేషప్రణయినః 63

5. తదానీ మనన్యశరణా(ద్రౌపదీ)భగవత్స్మరణం కృతవతీతి కథయితుం
కవి ర్వసో దూతత్వం పరికల్ప్య కథాం రచయతి.

శ్లో॥ విచారం చాకార్షీ దహహ నపితా నాపి దయితా
నపుత్రా నభ్రాతా శరణ మిహ మేఽన్యాస్తి నగురుః
ఇతి భక్తాధీనా ద్యకులవతంసా దపర ౧
త్వథో న్మారం స్మారం మురరిపు మహం యామి శరణమ్ 183

6. అథ శ్రీకృష్ణం వర్ణయతి:—

శ్లో॥ దుకూలం హేమాభం నిజకటితటేఽసౌ పరిదధ
త్సుశాఙ్ఖ్యాభ్య రత్నానాం నిబిడ ముపనద్ధం యదుపతిః
దధానః శ్రీవత్సం హృది సువిలసత్కౌస్తుభమణి
ర్మహానన్దాబ్ధి ర్నయనకథమాయాస్యతి సతే. 158

7. భగవచ్చరణచిహ్నాన్యాహ:—

శ్లో॥ ధ్వజచ్ఛత్రామ్భోజాఙ్కుశకులిశసత్కుమ్భసునను
ర్గదాశఙ్ఖజుష్టస్థితయవసుచక్రాదిలసితౌ

సఖేదుద్యోతాన్వైభి ర్విధుర వివశధ్యానవిచయే
హృది ధ్యాతౌ భక్తై ర్హృదయచరణౌ ద్రక్ష్యసి హరేః. 159

8. న కేవలం కథామాత్ర మిదమ్. ఉపదేశోఽప్యయం సర్వేషా మిత్యాహ-

శ్లో. ఇతి స్మారం స్మారం తవ గుణగణా న్యాదవపతే
మనోదూతం యోఽస్య స్వయి నిజకృతే ప్రేషయతి చేత్ .
స మ ఇచ్ఛాస్థానం తత్ప్రణయరసనాళ్యుజ్జ్వలితహృ
ద్విభో భక్తాధీనః శ్రుతిశిఖరమృగ్యోఽపి భగవన్. 195

9 అథగ్రన్థే గుణాలంకారరసాద్యభావేఽపి భక్తానాం రుచి ర్భగవద్గుణవర్ణనా సక్తానాం సహృదయానాం భవిష్యత్యే వేత్యాహ—

శ్లో. న సందర్భే ప్రౌఢి ర్నచ గుణసమూహో న కవితా
పరీపాకః కశ్చిత్పదసుఘటనా వాప్యత్ర నతథా
తథాపి శ్రీకాన్తప్రగుణకథనేనా త్రసుధియాం
భవే చ్చిత్తాసక్తి ర్యది ఫలవతీ స్యాత్ కృతి రియమ్. 200

10 భగవత్పరాయణై స్తచ్చరితామృతశ్రవణలుబ్ధై రిద మవశ్య మాదరణీయమే వేతి ప్రార్థయతే:—

శ్లో. యది శ్రీమన్నన్దాత్మజచరణరాజీవమధుపః
సమాస్వాదాసక్తో భవతి భవతాం చిత్తమధుపః
కథాయాం వా తుచ్ఛీకృతసురసుధాయాం మధురిపో
ర్మనోదూతం కావ్యం శృణుత సరసం భక్తిరసికాః. 201

11. భఙ్గ్యన్తరేణ కావ్యోత్పత్తి మాహ:—

శ్లో. స్థితా ద్బృన్దారణ్యే తరణితనయాతీరలహరీ
పరీరమ్భాదమ్భఃకృమతయుజి వంశీవటతలే
సకాన్తా చ్ఛ్రీకాన్తా దధిగతవతీ సంగ మసుఖా
మతిర్మే ప్రాసూత ధ్రువ మిహ మనోదూతతనయమ్. 202

12. ఉపసంహారశ్లోకములలో మొదటిది ప్రక్షిప్తోపయోగము—

శ్లో. వేదేన్దువసుశీతాంశు (1814) మితేఽబ్దే మార్గశీర్షకే
సితాష్టమ్యా మిదం కావ్య మర్పితం హరిపాదయోః.”

ఇతి శ్రీమత్తైలఙ్గాన్వయ శ్రీభూధరభట్టాత్మజ శ్రీరామకృష్ణతనయ పఞ్చనదాన్వయవ్రజనాథవిరచితం మనోదూతాభిధం, సహృదయహృదయాహ్లాదనాపరనామధేయం కావ్యం స్వకృతమఞ్జుభాషిణ్యా టీకయా సమేతం సమాప్తమ్.

XXVII. మనోదూత:—20. కృత్యాద్యష్టశ్లోకములవలనను గద్యమువలనను. నీకవినామము రామరామకవి యనియు, నితఁడు చైతన్యుని మేనమామ యగువిష్ణుదాసవంశీయుఁ డనియుఁ దెలియుచున్నది. ఇతివృత్తము తుల్యమైనను నిది విష్ణుదాసకృత "మనోదూత" కంటె భిన్న మని తెలియుచున్నది. ఇందు మొదటిరెండుశ్లోకములు మాత్రము శార్దూలవృత్తములు, తక్కిన వన్నియు శిఖరిణీవృత్తములు.

XXVIII. మనోదూతికాకావ్యము:—21. ఇందు దూతకావ్యవ్యాజమున జీవాత్మపరమాత్మలసంబంధము వర్ణింపఁబడినది.

XXIX. మనోదూత:—22. ఇది జైనకావ్యమని తోఁచెడిని. అందుచే నామసామ్యము గలపూర్వోల్లిఖితకావ్యము లన్నిటికంటె నీకావ్యము విలక్షణమైన దని యూహింపనగు.

XXX. మయూరసందేశము:—23 రంగాచార్యరచితము.

* XXXI మయూరసందేశము— కవిపేరు మృగ్యము. ఇందుఁ బ్రియుఁడు తనప్రాణప్రియకు మయూరముచే మదనసందేశము నంపుట వర్ణితము. పూర్వోక్తరంగాచార్యనిర్మిత 'మయూరసందేశము' కంటె నిది విలక్షణమా యనువిషయము విమర్శనీయము. మద్రపుర ప్రాచ్యలిఖితగ్రంథాలయపత్రిక (A Triennial Catalogue of Manuscripts' collected during 1919–'20 to 1921—1922 for the Govt. Oriental MSS. Library, Madras. Vol. No. IV. Part I. Skt. A., Page 4298; R.No. 2963.) లో నుట్టంకింపఁబడిన 'మయూరసందేశము' లోని శ్లోకముల నుదాహరించెద.

కావ్యారంభము:—

'శ్లో. అవిరతమదధారాధారణాద................
నదమధుకరమాలాకూజితోద్ఘోషితాశమ్
ముమమనసిసమిద్ధాం (న్ధాం) సిన్ధురేన్ద్రాననంత
త్రిమపి కనకశైలప్రస్థసచ్ఛాయమోజః.

---

20. 'వంగీయ సాహిత్యపరిషత్తు'—కలకత్తా. "Sanskrit Manuscripts No.1282

21. "Catalogue of Skt. MSS. in the Raghunatha Temple Library of His Highness the Maharajah of Kashmir"—M. A. Stein- p. 70; 287; Introduction, page xxv.

22. "జైనగ్రంథావళీ" (శ్రీజైనశ్వేతాంబరసమ్మేళనము,' బొంబాయి.)

23. "A Preliminary List of Sanskrit and Prakrit Manuscripts in the Adyar Library"—Madras, p. 130.

శ్లో. శ్రీరఙ్గోర్వీపతిబహుమతం మారచేమన్త్రికాఖ్యం
మారస్యాస్త్రం మహిత మధికృత్యాధునా సాధుబద్ధమ్
హృద్యం స్వల్పం మధురమధు' వ్యర్థిసన్దేశకావ్యం
నవ్యం విద్వత్పరిషదామస్తు కర్ణాతిథేయమ్.

శ్లో. స్వర్గారామద్రుమనవలతాసూనసౌరభ్యలాభ
గ్రామం (మే) పుష్పన్ధయకలకలధ్వానవాచాలితాశే
సాధే సాధీయసి (ప)రిలసచ్ఛన్దిపాదాభిరామే
రేమే వ్యోమస్పృశిమధిశయా లాలితః కోఽపి కా(మీ)

శ్లో. కుర్వన్నిచ్ఛావిహృతి ముమయా సఙ్గః స్ఫాటికాద్రా
వాస్తేఽవల్లీచలనకణికాక్లప్త............స్థః (?)
శ్రీరఙ్గోఽయం స్వయమితి ధృతభ్రాన్తిరేకం కదాచిత్
ప్రక్రాన్తో..............తిముఖః ఖేచరాఘ స్సిషేవే

శ్లో. హాహన్తాసౌ హతవిధివిపర్యాసితాత్మా తదీయం
దృష్ట్వా జాడ్యం ముహురపి మిలద్ధస్తతాలం జహాస
సేయం స్వర్గీభవదసుమనో మానమానీతిరస్మై
శాపః ప్రాదాన్మహ(ద)వమతిః కన్యనాత్రిప్రసూతే.

శ్లో. తేనావాసో మమమధుజిత స్సన్నిధౌ క్వాపి పుణ్యే
క్షేత్రే స్యాదిత్యధనవినయం ప్రార్థ్యమానస్తథేతి
ప్రాహ్యప్రాయాదయమపి సమైత్తుష్టసద్యస్సుదూరే
స్యానన్దారే విగతదయితా దీన(మా)త్మానమేవ.

శ్లో. దైత్యారాతిం దలితశతమన్యూపలోదారశోభం
పశ్యన్నేనం భుజగశయనే కల్పితస్వాపసౌఖ్యమ్
తాపోద్రేకస్తదపి ముహుః ప్రేయసీవిప్రయోగా
దచ్ఛ్వశ్వాస తృణమివ శనైరేష సఞ్జాతసంజ్ఞః.

శ్లో. సోఽయం కాన్తావిరహజలధౌ వీతపారే నిమగ్నః
స్వంవృత్తాన్తం సరసిజదృశో హన్త సన్దేష్టుకామః
విద్యుద్వల్లీపచితనవామ్భోదనీరన్ధ్రితాశే
కాలే కాన్తారమపి శిఖినం సమ్పతన్తం దదర్శ.

* * * * *

# మల్కాపురశాసనము.

— జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్. —

---

ఈశాసనము గుంటూరుమండలములో గుంటూరుతాలూకాలోఁ జేరిన మల్కాపుర మనుగ్రామము పొలములో నొక పాడుదేవాలయమునెదుట నున్న రాతిస్తంభము మీఁదఁ జెక్కఁబడి యున్నది. ఈస్తంభము 14 అడుగుల 7 అంగుళముల యెత్తును 2 అడుగుల 10 అంగుళముల వెడల్పును 2 అడుగుల 8 అంగుళముల దళసరియుఁ గలది. అశోకశాసనస్తంభములు గాక యింత పెద్ద శాసనస్తంభము నే నెక్కడను జూచియుండ లేదు. 1915 వ సంవత్సరములో నేను జూచినప్పు డీస్తంభము నిలువఁబడియుండక నేలపైఁబడియున్నది. పిదప రాజకీయాధికారులు దానిని నిలువఁబెట్టి పీఠము కట్టించినారు.

స్తంభము మూఁడుప్రక్కల శాసన మున్నది. తొలిప్రక్కను 90 పంక్తులును రెండవప్రక్కను 79 పంక్తులును మూఁడవప్రక్కను 31 పంక్తులును వెరసి 200 పంక్తు లున్నవి. మొదటివైపు 72 పంక్తులు మాత్రమే ముఖ్యశాసనములోనివి. తక్కిన 18 పంక్తులు పెద్దశాసనమునకు సంబంధించినవే యయినను శాసనభాగములు కావు. అవి పెద్దశాసనము చెక్కినపిదపఁ జెక్కఁబడినట్లు కనఁబడుచున్నది. మూఁడవప్రక్కను పెద్దశాసనముక్రింద నిటీవలఁ జెక్కఁబడిన మఱికొన్ని తెలుఁగుశాసనములు గలవు.

గ్రామసీమాదివివరణము తెలుఁగులో నున్నది. తక్కినశాసన మంతయు సంస్కృతపద్యరూపముగా నున్నది లిపి యాకాలపు తెలుఁగులిపి. అక్షరములు పెద్దవిగాను స్పష్టముగాను నున్నవి. వ్రాఁతతప్పులు కొంచె మున్నవి. భగవాను (I- 7) ననుపాలయతు (I-30) ప్రక్రీడతు (I- 37) ఇత్యాది శబ్దములయందుఁ దుదిహల్లున ఉకారము చేర్పఁబడినది. ఇది పొరపాటు. తెలుఁగుభాగములోఁ దప్పు లెక్కువగా నున్నవి.

1183వ శకసంవత్సరమునకు సరియైన దుర్మతిసంవత్సర చైత్రబహుళాష్టమీశుక్రవారమునాఁడు కాకతిగణపతిదేవమహారాజు మందరమనుగ్రామమును, ఆదినమందే గణపతిదేవునికూఁతు రగురుద్రమదేవి వెలఁగపూఁడి యనుగ్రామమును విశ్వేశ్వరశంభు వను శైవాచార్యున కిచ్చిరనియు, విశ్వేశ్వరశివుఁ డీరెండు గ్రామములం జేర్చి విశ్వేశ్వరగోళకి యనుపేర నొక యగ్రహారమును బ్రతిష్ఠించి యందు విశ్వేశ్వరశివాలయమును, మఠమును, సత్రము మొదలగునవి

గలిపె ననియుఁ జెప్పుట యీశాసనముఖ్యోద్దేశము. కాకతీయరాజచరిత్రము, గోళకీశైవమతసంప్రదాయము, పూర్వగ్రామనిర్మాణపద్ధతి యను నీమూఁడువిషయములకును సంబంధించిన విశేషాంశములు పెక్కు లీశాసనమువలన విశదమగుచున్నవి. వాని నీక్రింద సంగ్రహముగాఁ దెలిపెదను.

## — కాకతీయరాజచరిత్రము. —

ఈశాసనమందు కాకతీయవంశము సూర్యవంశములో నొకశాఖ యైనట్లు వర్ణింపఁబడినది. కాకతీయులు క్షత్రియులే కారని నామతము. ఈవిషయమును గూర్చిన వాదప్రతివాదములు పరిషత్పత్రిక పదియవ సంపుటమునఁ జూడఁ దగును. అందలి నావ్యాసములో గణపతిదేవుని యనంతరము పుట్టినశాసనములలో నెక్కడను కాకతీయులు సూర్యవంశపురాజు లైనట్లు లేదని యున్నది. ప్రస్తుతశాసనము గణపతిదేవుని కాలమందుఁబుట్టినట్టే యూహింపవలసి యున్నది. దీని యుపపత్తి ముందుఁ దెలిపెదను.

గణపతిదేవుని పితామహుఁడగు ప్రోలరాజు వంశకర్తగా నీశాసనమందు వర్ణింపఁబడినాఁడు. ఇతరశాసనములను బట్టియుఁ బ్రతాపరుద్రీయమును బట్టియు, కాకతీయవంశక్రమ మీక్రిందివిధముగా నున్నట్లు గనఁబడుచున్నది.



రుద్రమదేవి గణపతిదేవుని భార్య యనునొకవాద మున్నది. కాని ప్రతాపరుద్రీయమందును, ఇదివఱలోఁ బ్రకటింపఁబడిన కొన్నిశాసనములందును నామె గణపతిదేవునిపుత్రిక యనియే యున్నది. ప్రస్తుతశాసన మీవాదమునే స్థిరపఱచుచున్నది. కావున రుద్రమదేవి గణపతిదేవునిభార్య యనువాద మిఁక శాంతించునుగాక.

ప్రస్తుతశాసనమందు "యస్యాః కాకతివంశమౌక్తికమణేః శ్రీరుద్రదేవస్సుత స్తస్యాః కిం కథయామ వైభవ మతః శ్రీరుద్రదేవ్యాః పరం" అని యుండుటచేత, ప్రతాపరుద్రుఁడు రుద్రమదేవికొడుకే గాని దౌహిత్రుఁడు గాఁడని కొంద ఱూహించుచున్నారు. కాని, యీయూహ సరియైనది కాదు. ప్రతాపరుద్రీయనాటకప్రకరణమందు స్వయంభూదేవుఁడు రుద్రమదేవితో "స్వీకృతే పుత్ర భావేన దౌహిత్రే ప్రాజ్ఞమూర్ధని । అస్మి న్నిధేహి ధౌరేయే గుర్వీ ముర్వీధురాం" (పూర్వము నాయాజ్ఞచే నీవు పుత్రభావముతో స్వీకరించిన దౌహిత్రుఁడును, ధురంధరుఁడు నగునీతనియందు బరువైన యీమహీభారము నుంచుము.) అన్న ట్లున్నది. దీనినిబట్టి ప్రతాపరుద్రుఁడు రుద్రమదేవికి దౌహిత్రుఁ డనియుఁ బుత్రుఁడుగా నామెచే స్వీకరింపఁబడె ననియు స్పష్టపడుచున్నది శాసనములోని సుతశబ్దమునకు స్వీకృతపుత్రుఁ డని యర్థము చెప్పికొనుట కభ్యంతర మేమియు లేదు.

ఈశాసనమువలన విశేషాంశ మొక్కటి తేలుచున్నది. గణపతిదేవుఁడును రుద్రమదేవియు నేకకాలమందే దానములు చేసినారు. ఆకాలమందు రుద్రమదేవి రాజ్యము చేయుచుండెను. (చూ. మొదటివైపు 42-48 పంక్తులు) శాసనాంతరమువలనఁ గూడ గణపతిదేవుఁడు శ. స 1120 మొదలుకొని 1182 వఱకు నలువదిరెండేండ్లు రాజ్యపాలనము చేసినట్లును శ. 1182 సంవత్సరమునందే రుద్రమదేవి రాజ్యమునకు వచ్చినట్లును గనఁబడుచున్నది. కావున దానకాలమందు రుద్రమదేవియే రాజ్యము చేయుచుండె ననుమాట తథ్యము. అట్లయినచో గణపతిదేవుఁ డాసమయమున దానము చేయుట యెట్లు పొసఁగె ననుసంశయము పొడముచున్నది. దీనికి సమాధానము గణపతిదేవుఁడు చిరకాలము రాజ్యముచేసి యవసానకాలమందు రుద్రమదేవికిఁ బట్టాభిషేక మొనర్చి తాను పైనుండి యామెపేర వ్యవహరించుచుండె నని చెప్పవలసినట్లు తోఁచుచున్నది. రుద్రమదేవి స్త్రీయగుటచేఁ దనయనంతర

మాహేశ్వరాజ్యాధికారమునకు శత్రువులవలన భంగము కలుగునేమో యనుభయము గణపతిదేవున కుండినట్లు కనఁబడుచున్నది. కావుననే కాఁబోలు నామెను కొడుకుఁగాఁ గొంతకాల మాతఁడు భావించి వ్యవహరించెను. "ఏవం మానుషశంభునా గణపతిమహారాజేనాభ్యంతర స్యానుభవమహిమ్నః సదృశమత్ర పుత్ర ఇతి వ్యవహారః కృతః । తదనుగుణాచ రుద్ర ఇత్యాఖ్యా" మానుషశంభుఁడైనగణపతిమహారాజుచేత తనపుత్రికయొక్క భావికాల మాహాత్మ్యమును దెలిసికొను తనయంతఃకరణప్రవృత్తికిఁ దగినట్లు పుత్రుఁడని వ్యవహారము చేయఁబడినది. తదనుగుణముగా రుద్రుఁడని పేరుకూడఁ బెట్టఁబడినది. అని ప్రతాపరుద్రీయము. దీని కనుగుణముగా రుద్రమదేవి రాజ్యారంభమునఁ గొంతకాలమువఱకు రాజుపేరు రుద్రదేవుఁడనియే కనఁబడుచున్నది. గణపతిదేవుని యనంతరము తనరాజ్యమును నిలుపుకొనుటకై రుద్రమదేవి యత్యధికప్రయత్నము చేసికొనవలసి యుండినట్లు "వెలుగోటివారి వంశావళి" యను ప్రాఁతపుస్తకములోని యీ క్రిందిభాగమును బట్టి స్ఫురించుచున్నది.

"నారికి నాత్మవల్లభుని నారియగా నొనరించు బ్రహ్మయుఁ గా ।
"నేరఁడు రుద్రమాంబ ధరణీసతికిన్ బతిగా నొనర్చె ము ।
"ర్వారవిరోధిమండలిని గర్వ మడంచితి వారమేటి వై ।
"శ్రీప్రసాదవాంక యరివిక్రమ సీకొరులీల చూడఁగన్ ॥

"అప్రసాదిత్యాంకు కాకతిగణపతిదేవరాయలు చనితే అతనికొమార్తె
"రుద్రమదేవిని పట్టముగట్టి కాకితరాజ రాజ్యస్థాపనాచార్యబిరుదున్న రాయ
"పితామహాంక బిరుదున్న డబ్బెయొద్దుకు నాయంకుల గా నొనరించి భైరవ
"వరప్రసాదలబ్ధ బిరుదు చ్ఛధరించి నెగడె మహిని."

ఈ హేతువు లన్నింటినిబట్టి గణపతిదేవుఁడు తాను జీవించియుండఁగానే రుద్రమదేవికిఁ బట్టాభిషేకము చేసినట్లు కనుపట్టుచున్నది. గణపతిదేవుఁడు జీవించియుండఁగానే ప్రతాపరుద్రదేవుఁడు యౌవనారంభదశలోనికి వచ్చినట్లు కూడ నీశాసనము తెలుపుచున్నది.

## —: గోళకీశైవమతప్రశంస :—

ఈమతము గంగ నర్మదానదీ మధ్యమం దున్న దహాలమండలమందు సద్భావశంభు వను శైవాచార్యునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. ఈయాచార్యునకు యువరాజదేవుఁ డను కలచురిరాజు మూఁడులక్షలగ్రామములు గలదేశము

భిక్షగా నొసంగఁగా నీయన యాభిక్షను గోళకీమఠమున కర్పణము చేసెను. సద్భావశంభుశిష్యుఁడు సోమశంభువు. ఈయన సోమశంభుపద్ధతి యను శైవాగమగ్రంథము రచించెను. ఈయనశిష్యుఁడు వామశంభువు. ఈయనశిష్యప్రశిష్యులు కొందఱు గడచినపిదప శక్తిశంభువచ్చెను. ఆయనశిష్యుఁడు కీర్తిశంభువు. ఆయనశిష్యుఁడు కేరళదేశజాతుఁడైనవిమలశివుఁడు. ఆయనశిష్యుఁడు ధర్మశివుఁడు. ఆయనశిష్యుఁడు గౌడరాఢాదేశమందలి పూర్వగ్రామనివాసి యగు విశ్వేశ్వరశివుఁడు ఈతఁడు కాకతీయగణపతిదేవుని దీక్షాగురుఁడును బ్రకృతశాసనములోఁ జెప్పఁబడిన దానప్రతిగ్రహీతయు. దహాలమండలమనునది చేదిదేశమున కపరనామధేయము. దీనికి రాజధానియైన ప్రస్తుతము తివారి యనువ్యావహారికనామము గల త్రిపురాంతకపట్టనమందుఁ బూర్వము గోళకీమఠ ముండెడిదఁట గోళకగిరి యనుకొండమీఁదఁ గట్టుటచే దానికాపేరువచ్చిన ట్లగపడుచున్నది. ఒక్క కాకతీయరాజే గాక యీయనకుఁ జోళరాజు, మాళవరాజుఁ గూడ శిష్యులుగా నుండిరి. గణపతిదేవుని యాస్థానము దీతనికిఁ బలుకుబడి యధికముగా నుండినట్లు కనఁబడుచున్నది. గణపతిదేవునకు శివదేవయ్య యనుమంత్రి యున్నట్లు సోమదేవరాజీయమువలనను బ్రతాపచరిత్రము *వలనను గనఁబడుచున్నది. విశ్వేశ్వరశివుఁడును శివదేవయ్యయును నొక్కరే యైన ట్లూహింపఁదగియున్నది. ఈయననుగుఱించి తిక్కన సోమయాజి గణపతిదేవునితో "వసుమతినాథ యీతఁ డీశ్వరుఁడు గాని । మనుజమాత్రుండు గాఁడు కల్లాఱు నితని। యనుమతింబున నీవు రాజ్యంబు నెమ్మి। నేలు" మని చెప్పినట్లు సోమదేవరాజీయమం దున్నది. ఈతఁడు చేసినదానములు గూడ గణపతిదేవుఁ డీతనికి వశవర్తియై యున్నట్లు సూచించుచున్నవి.

—: పూర్వకాలపుగ్రామనిర్మాణపద్ధతి :—

తనకు దానముగా నొసంగఁబడిన మందర, వెలంగపూఁడిగ్రామములు రెంటిని జేర్చి విశ్వేశ్వరగోళకి యనుపేరుతో నొకయగ్రహారమును, అందు విశ్వేశ్వరాలయమును, సత్రము మొదలగునవియు విశ్వేశ్వరశివుఁడు ప్రతిష్ఠించెను. అఱువదిమంది ద్రావిడబ్రాహ్మణుల రప్పించి యీగ్రామమందు నిలిపి వారి కొక్కరికి రెండేసిపుట్లవంతున భూమి యిచ్చి మిగిలినభూమి మూఁడుభాగములు చేసి యందొకభాగము విశ్వేశ్వరునకును, నూతనముగా స్థాపింపఁబడిన

*. చూ. ఆం. సా. ప. ౯ సంపుటము.

# మల్కాపురశాసనము.

— మూలము. —

### మొదటివైపు.

౧ స్వస్తిశ్రీః వితరతు భగవా నసౌ శ్రియం వః కరివ
౨ దనో హారినీలభాసి యస్య । ద్యుతి వరసరసిస్ఫురత్త
౩ రఙ్గ శ్రియ మధిగా మళివ్రాత్తమో వహంతి॥ జయ
౪ తీందోః కలా ఖేలతు గంగాంభఃకణమంతుర్రైః। కర్రైః కరోతి యూశే
౫ ంభో మూర్ధ్ని ముక్తావలిశ్రియం । హారిరవతు కిరితను ర్వోర్వ
౬ (భు) వ ముద్వోఢుం గతస్య వరుణపురీం । యస్యాఖిలజలధిజ
౭ లం పాద్యాయాభూ దనఘ్యాయ॥ జయతి భగవాన్ స్వయ
౮ ంభూ ర్గణపతిన్నృపతే హ్యాదిష్ఠిత స్సగతం । యత్ప్రాదుణ్యకటా
౯ క్షైః వృద్ధిం ప్రాప్తాంధ్రదేశశ్రీః॥ అస్తి స్వస్తిమతీకరు భ్భగవతో
౧౦ దేవస్య తస్యాప్సురసాభికంకజసంభవస్యభుజతో భూవల్లభాజ
౧౧ జ్ఞిరే। తేషాం తిగ్మరుచి సంతతిభువో యే దుర్జయాఃక్షత్రియా స్తేషా
౧౨ మస్తి కులం కలంకరహితం శ్రీకాకతీభూభుజాం॥ వీర స్తస్మాద
౧౩ జని రజనీనాథవద్దుగ్ధసింధోః కీర్త్యాజ్యోత్స్నాభరితభువనః ప్రోలభూపాల
౧౪ నామా । రాజ స్యస్మి న్నమపి నృపతిం రాజశబ్దాభిధేయ న్నైవాస్రా
౧౫ క్షాత్రి జగతి వినా యామినీకామినీశం । కీర్త్యా యస్య హిమేందు కుందవిశ
౧౬. దామూర్త్యా జ్జనానందినీ దానం విశ్వజనార్తిహారి చరితంగంగావయః
౧౭ పావనం । చిత్తం శంబుపదారవింద యుగళ ధ్యానామృతక్షాళితం శౌ
౧౮ ర్యం నిర్వ్యగరాతి దుర్మదహరం ధామాపి ధామ శ్రియః॥ రుద్ర
౧౯ దేవస్తతో జాతో యత్కీర్త్యా భూ రలంకృతా । ప్రతిపక్షమహీపా
౨౦ లయశోనిర్మార్గ్య మృజ్ఞ॥ రాజానః కతివా నసంతి సుభటాస్స
౨౧ ంక్రాంతవిక్రాంతయ స్తేతిష్ఠంతు త మేకమేవ శృణుమ శ్శూరేషు రుద్ర
౨౨ ంన్నృపం । యస్యాసీ దసిదారితారిమకుటశ్రేణీశిరః కందుకక్రీడాంప్రేకి
౨౩ తవిక్రమా యుధి జయశ్రీః ప్రేయసీ స్థాయినీ॥ ఏక ఏవధనుర్ధారో రుద్రదేవోమ

౨౪ హీభుజాం। సురేశ్వరాణాం సర్వేషాం పినాకీవ ధనుష్మతాం ॥ అథానుజ
౨౫ స్తస్య మహీశశాసన ధీరో మహాదేవనృపో మహౌజాః। ప్రతాపదీపః
౨౬ ప్రతిపక్షభాజాం శామ్యంతి యత్త్రైయ్యకథానిలేన॥ కుందేందుచందన
౨౭ సఖః కుముదస్య మిత్రం స్వస్సింధుసింధురతురంగరుచాం సనాభిః।
౨౮ కర్పూరహారహరహాసపయఃపయోధిబంధు ర్విభాతి యదుదార
౨౯ యశోవిలాసః॥ తస్యాయం తన స్త్రయీమయతనోర్దేవాద్భవా
నీపతేః
3౦ (బ్దః) ప్తాం సమపాలయత్ గణపతిః క్ష్మాపాలచూడామణిః। యస్మి
3౧ న్నస్త్రయశాలి విక్రమకథా ధారాముచి శ్రీఘన పృథ్వీదష్టదురీశదావదహ
3౨ నప్రాప్తాం రుజం ముంచతి॥ దర్పే ధన్వని మత్సరో రణజయే ధార్ష్ట్యం
ద్విషా రో
33 షాణేః క్రౌర్యం శౌర్యవిదా తురంగదమనే చాపల్య మాశాయధి।
క్రోధోదుష్ట
3౪ జనే భయం ద్విజధనా లోభశ్చ ధర్మార్జనే పూజాకర్మణి శాం
కరే గణపతిక్షోణి
3౫ పతే రాగ్రహః॥ కోదండోచ్చండవేగవ్యథితకరిహయవ్రాత పృథ్వీశసైన్యం
కింబ్రూమ
3౬ శ్చండిమానం గణపతినృపతే ర్బాహుదండద్వయస్య। అద్యాప్యుద్దామ
దర్పే దుర్ధర
3౭ తిపృతనాకోటికంకాలకూట ప్రక్రీడత్ప్రేతయూథవ్యతికరవిషమభూ
3౮ మయో భీషయంతే॥ కతికతి నసంతి భూపాః కతికతి గుణగణాఢ్య
3౯ రణాః॥ గణపతినృపతిస్త్వేకో వరపతికలిపోషకః క్షోణ్యాం॥ నిస్సాణరవ
౪౦ సంత్రస్తాః తుణాద్గణపతే ర్నృపాః। అపిత్యజంతి దుర్గాణి సదారా
నేవ కేవ
౪౧ లం॥ రుద్రదేవీసముద్భూ త్పురణ్యా త్సర్వభూభృతాం। గంభీరాస్మహేత
౪౨ సస్మాలక్ష్మీరత్నాకరా దివ॥ సర్వోర్వీశకిరీటకుట్టిమతటీవిన్యస్తపాదాం
బుజా శా
౪3 స్త్యేషా చతురంబురాశిరశనాం శ్రీరుద్రదేవీ భువం। యస్యా జన్మమ
హోత్సవో

౪౪ గణపతేః క్ష్మాపాలచూడామణే ర్విఖ్యాతోర్జ్జితకీర్తికాలకలుష(ధ్వా)ధ్వాంతౌఘ

౪౫ తేజోనిధేః। సామ్రాజ్యే ఖలకుర్జ్జితం విరచితే శ్రీరుద్రదేవ్యాఖ్యయా చాతుర్వ

౪౬ ర్ణ్యనిజస్థితివ్విజయతే విద్రాతికాలః కలిః * ధర్మ్మస్సా భగవా న్విభాతి దురితం

౪౭ దూరే ద్విజానాం ద్విష స్తన్నామగ్రహభీషితా గజపురా న్నిర్యన్తి పర్యాన్తు

౪౮ లాః॥ ఆక్రామంతి తర త్తరంగవిగళద్దుగ్ధాబ్ధి ఫేనావలీ రాచామంతి శరత్ప

౪౯ శాంకవి సద్యోత్స్నా ప్రవాహామృతం। ఆకర్ణ్యంతి సురేంద్రదంతిదశన

౫౦ ప్రాగ్భారలగ్నాం శ్రియం ముక్తాహారలతాయితాః ప్రతిదిశం రుద్రాంబికా

౫౧ కీర్త్తయః॥ శ్రీవిశ్వేశ్వరదేశికేంద్ర శివహస్తా*సిద్ధోర్వ్విక్రమ స్త్రిస్రోతిణీశ

౫౨ జగద్దళః ప్రతిబలప్రధ్వంసి జన్మోత్సవః। యస్యాః కాకతివంశమాణిక

౫౩ మణే శ్రీరుద్రదేవస్సుత స్సస్యాః కింకథయామ వైభవ మతిశ్రీరుద్రదేవ్యా

౫౪ ఃపరం॥ అస్తి విశ్వంభరాసారః కమలాకులమందిరః। భాగీరథీ నర్మ్మద

౫౫ యో ర్మ్మధ్యం దహాలమండలం॥ ఉగ్రం తత్ర తపశ్చర న్నియమయు

౫౬ న్వాబాహ్యేంద్రియక్రీడనం। సాంద్రానందమయే సమాధిసమయే

౫౭ చిత్తేన లీనశ్శివే। నీత్వా కాల మనంత మంతకజయీ సద్భావశంభు

౫౮ గ్గుర్వరు ద్దుర్వాసోన్వయసంభవ స్సుచరితః ప్రాబుద్ధపుణ్యా న్నృణాం॥ శైవానా

౫౯ ం ప్రథమాయ శంకరపదధ్యానామృతాంభోనిధి క్రీడాంబ్రేడనకర్మ్మకర్మ్మ

౬౦ లతిరస్యాంతాయ శాంతాత్మనే। తస్మై నిస్పృహచేత సేగళచుదక్ష్మాపాళచూ

౬౧ డామణిగ్గ్రామా ణాంయువరాజదేవనృపతిర్బ్బిక్షాంత్రిలక్షీందదా॥కృత్వా

౬౨ నశైవముని రద్భుతశీలమూర్త్తిః శ్రీగోళకీమఠముదార ముదాత్తధితిః

౬౩ (తి) న్యాకరస్స్పృహదశికమాత్రికానాం వృత్తిం చకార సకలామపి తాం త్రిలక్షీం

౬౪ ।ప్రాచీనపుణ్యపరిపాకవశాత్ప్రజానా మావిర్బభూవ భగవా నిహ సో

౬౫ మశంభుః। నామ్నా సజేన స్సకలాగమసింధుసేతుం యః పద్ధతిం కరుణ

*శివహస్తాసి యున్నచో శాకగుర్వక్షరము లోపించినది.

౬౬ యా ప్రతిమాం బబంధ। అథనృపశేఖరమాలా లాలితపాదోత్ర వామళ
౬౭ ంభు రభూత్। అద్యాపి కలచురీశా యచ్చరణారాధకాః ప్రశస్యంతే। లబ్ధ
౬౮ దేశికపదా మనోహారా భూరిదానపరితోషితార్థినః। యత్రమత్తకరి
౬౯ ణోపి హృద్గతే పాశభేద మిహ భద్రజాతయః। తస్మిన్ స్మృతే తస్యగురో
ర్బభూవు
౭౦ శ్శిష్యాః ప్రశిష్యాశ్చ పరస్సహస్రాః।విగ్రహీతుం సమనుగ్రహీతుంక్షోణీ
౭౧ శ్వరా న్పతుకటాక్షపాతైః। ఇత్థం కాలే యాతిసత్సంప్రదాయేసంతానేస్మిన్న
౭౨ ర్గతే సంతానకల్ప శ్శంభోర్ధే శ్శక్తిశంభో రుదారా చ్ఛిష్యశ్రీమూర్తిస్త్రి
శంభు ర్బభూవ॥
౭౩ చిల్పి ఆచార్యు లంశాంతోజు గొడుకు గుణ్డోజునకు ఖ౨ అక్షరాలపై య్యా
౭౪ పోజు కొడుకు పోలోజునకు ఖ౧ శ్రీమతు రాచగురుదేవార అనతిక్రమ
మున శ్రీము
౭౫ తు కాశీశ్వరశివా అయ్యంగరు సాని ప్రిత్తులు పెట్టిన పైయినము॥ ప్రో
లాండి స్వామి త్తులు కొమ్మల అక్క
౭౬ సానికి ఖ౧ తుం౧౦। నల్లదేవిస్వామి కుంత్తులు నలమరాసనికిఖ౧తుం౧। సమ
యమం త్రికుంత్తు
౭౭ లు విశ్వేశ్వరమణిభ్యానకు ఖ౧తుం౧। ఆడరికుంత్తులు గోళగిరిమణిభ్యా
నకు ఖ౧ తుం౧।
౭౮ వీరభద్రపై యిరగి ఆంకరికి ఖ౧తుం౧। సాకు(వె)న్నజీయకుమతెకు తుం౧।
వేమన
౭౯ జియనికుంతులు కొమసనికి ఖ(౧) తుం౧। ప్రోలబోయకుంలు కొమసా
నికి ఖ౧ తుం౧। త్రుట్టు
౮౦ (పా)ము కొమ్మసానికి ఖ౧ తుం౧। త్రుట్టపాము గుడ్డసానికి ఖ౧
తుం౧। (వెన్న) సానికూంతు
౮౧ లుతల్లసానికి ప్రిత్తి ఖ౧ నం౧౦। నడపల్లె మల(న) మనుమలు పాత్రట
సాని
౮౨ కి ఖ౧ నం౧। సూర్యదేవని కూంతులు తిరుమత్తసానికి ఖ౧ నం౧।
వెలంకహాండి

౮౩ శ్రీసోమనాథదేవరకు ఖ౨ ఆస్తనపదిత్రిపుర। ఇడుపిల్లప్రదిండిదిన గణేశ్వ
రునికి న ౩

౮౪ శ్రీవిశ్వనాథదేవర గుడిపనిచేసి కా

౮౫ సె అ(సో) జునకు ఖ౧ సన్నపోడు

౮౬ నకు ఖ౧ పొన్నోజునకు ఖ౧

౮౭ ......ండికూంత్రులు మొదలుమకు గోకసనో౦

౮౮ ......కన న౧౦ శ్రీవిశ్వనాథదేవర

౮౯ ......మాండికి కేసరి ఖ ౧ విరిగా

౯౦ ......నికి కేసరి ఖ౧ లోక్కో

—। రెండవవైపు ।—

౧ ప్రణామవ్యాలోల త్తలచురిమహీపాలపరిష త్కిరీటప్ర క్రీడ త్త్రిరణకలికాలా

౨ లితపదాః। యశఃపూరస్ఫూర స్తబకితదిశః కేరలభవా స్తతః పద్మావాసా
విమ

౩ శశివపాదా స్సుముభవా। నివైర్గర మువ్యార్గం కలికాలమధ్యే స్థాతుం
సదాభ్యా(०)

౪ కుతుకీవ ధర్మః। శిష్యః కృపాకందలితాంతరాత్మా తేషా మభూ ద్ధర్మ
శివో మునీ

౫ ంద్రః। యం కృపానిధి ముదారవైభవం ధర్మశంభు మఖిలార్తిభంజ
నం। ఏకప

౬ క్త్రకమలం సదాశివం సంశాధా మకృతిసః ప్రచండతే। అధ్యేతా నిగ
మస్య ధర్మతన

౭ య శ్రీగౌడరాష్ట్రోల్లస త్పూర్వగ్రామశిఖామణి గ్గణపతిక్ష్మాపాల
దీక్షాగురుః

౮ క్షీరాబ్ధేరివ చంద్రమాః కృశికలామాలే య్యర్ధా పణ్ముఖః శ్రీవిశ్వే
శ్వరశంభుస

౯ గ్రతపసశ్శ్రీధర్మశంభోరభూత్। చిరంవృద్ధిపాలావలీముకుటఘృష్టాంఘ్రి
కమలద్వయో

౧౦ విద్యావల్లీవలయకలనాకల్పకతయః। సదా దాంత స్స్వాంత స్థిరతరో లస
ద్ధూర్జటి

౧౧ మహాశాంతః కాంతోజయతి భువి విశ్వేశ్వరశివః। శ్రీచోళేశ్వరమాళవ
౧౨ క్షితిపతి రాజన్యచూడామణియుత్భ్యాకృష్టః కృతఃపరంగణపతిక్షోణీపతిర్యస్య
౧౩ త్సుతః సహ్యస్తస్య ముదే సదేశికవర శ్శైవాగమాంభోనిధి శ్రీవిశ్వేశ్వర
దేశికః కల
౧౪ చురిక్ష్మాపాలదీక్షాగురుః। గౌడాః పూర్ణమనోరథాః కతికతి ప్రాప్తశ్రియ
౧౫ స్తాపసా। స్నాతుష్టాః కవిపుంగవాః కతికతి ప్రధ్వస్తపాపా నృపాః
యేతస్మిన్
౧౬ గణపత్యధీశగురుతాసింహాసనాధ్యాసిని శ్రీవిశ్వేశ్వరదేశికే శివపురీ విశ్రా
౧౭ ణవశ్లాఘి। త్ర్యంగత్వంగజటాకిరీట ముదయస్మేరారవిందాననం ముక్తా
కుండల
౧౮ తాడితాంసశిఖరం హారైర్మనోహారిణం। విద్యామండపవర్తినం గణప
౧౯ తిక్ష్మాపాలదీక్షాగురుం। శ్రీవిశ్వేశ్వరశంభు మీక్షితవతాం తే చక్షుషీ
చక్షుషీ
౨౦ లోహః కోయం శకస్యాబ్దే దుర్మతౌ వత్సరే శుభే। చైత్రే సితేతరాష్ట
మ్యాం వా
౨౧ రేశుక్రాభిధానకే। విషయే వెలినాడాఖ్యే కండ్రవాట్యాం విశేషతః। యకాత్త
౨౨ రేణ వహతి కృష్ణవేణీ మహానదీ। శ్రీవిశ్వేశ్వరశంభవే గణపతిక్షోణీ
శ్వరేణా
౨౩ దరాద్గ్రామం స్సుందరనామధేయమఖిలై స్సర్వర్గ్ద త్తమాయైస్సమం। తత్పు
౨౪ త్రి తదనుజ్ఞయా పశుపతేః శ్రీరుద్రదేవీపుర్గః ప్రాదాద్గ్రామవెలంగపూండిస
౨౫ హితం సీమాష్టకేనావృతం। అష్టస్వామ్యేన సహితం ధారాపూర్వంసక
మకం కృ
౨౬ ష్ణవేణీనదీమధ్యగతయా లంకయా సహ। తస్యగ్రామస్య సీమానః కథ్యం
౨౭ తే పూర్వతః క్రమాత్। పరిజ్ఞానాయ సర్వేషాం భాషయాంధ్రయా
స్ఫుటార్థ
౨౮ యా। పూర్వస్యాం। పెదుంబాక దిక్కు మొదవిలుపుం గాల్వ పొలమెర। ఆ
౨౯ గ్నేయ్యాం। తాండిమండి వచ్చిన మద్దిమడుగు కాల్వ పొలమెర। దక్షిణస్యా

24, 25 పంక్తులలో ప్రాదాద్గ్రామ అనునది ప్రాదాద్గ్రామం అని యుండవలయును. వెలంగపూండిసహితం అనగా వెలుంగుపూండి గ్రామసహితం అని యర్థమైనట్లు తోచుచున్నది.

3౦ ౧। కట్టించినొమ్ము కాల్వ పొలమెర। నైరుత్యాన। ఉప్పలపాటిచెఱ్వు పసుమ
3౧ టికొమ్ము రావిపూండి వెలంగపూండి పొలమునందు పొలమెర। పశ్చి
3౨ మాయాం। మందరానకూను వెలంగపూండికిని పసుమటిరావి
33 పూండి పొలములోని నల్లంచున్న ఉత్తరము పెరుంబడి యు పొలము
3౪ నంకు పొలమెర। వాయవ్యాన। పెరకస్సుండి వెళ్లిన ఇస్సుగాలి కాల్వ
3౫ తలపొలమెర। అది మొదలు ఈశానదయ్యగాంతము కృష్ణవేణియే పొలమెర।
3౬ అయిశాన్యాన। కృష్ణవేణిసుండి పెనుంబాకరద్ది త్రవ్వించిన కాల్వతలపొలమెర।
3౭ రావిపూండికి ఐశాన్యము। మందరామకూను వెలపూండికిన్ని వాయవ్య
3౮ ము పెరకస్సుండి వచ్చినపాయేటి తలకడుమటి సీమగాను మందర
3౯ పులంక॥ శ్రీవిశ్వేశ్వరదేవ మింమకలికాచూతం మఠం శాశ్వతం సత్రంవి
౪౦ శ్వజనాగ్రహారసహితం సుస్థాప్యనిత్యోజ్జితః। శ్రీవిశ్వేశ్వరగోళకీత్యభిధ
౪౧ యా తంగ్రామ మత్యాదరాత్ శ్రీవిశ్వేశ్వర స్వమయుజ త్సగాడచూ
౪౨ డామణిః॥ నానాగోత్ర సముద్భూతా ద్రావిడా యేద్విజోత్తమాః। పరస్ప
౪3 రం ప్రకుర్వాణాః క్రయవిక్రయ మాదికం॥ షష్టిసంఖ్యావిశిష్టేభ్యః ప్రత్యేకం
౪౪ పుట్టికాద్వయం। పెరుంబాకప్రసిద్ధేన మానదండేన సమ్మితం స్థిత్యుపాధిమ
౪౫ దాత్తేభ్య శ్రీవిశ్వేశ్వరదేశికః॥ ఏతత్క్షేత్రంతు పుట్టినాం వింశత్యాభ్యధికంశ
౪౬ తం। వెలంగపూంశిసహితం దత్తా మందరనామకః॥ త్రిధా విభజ్య తత్సి
౪౭ ష్ట మేకం భాగం పినాకినే। విద్యార్థిభ్యో పరం భాగం శుద్ధశైవమఠాయ
౪౮ చ। ప్రసూత్యారోగ్యశాలాభ్యాం విప్రసత్రాయ చేతరం। ప్రాదాద్విశ్వేశ్వరశ్రీ
౪౯ వ శ్శైవసిద్ధాంతపారగః। ఋగ్యజుస్సామవేదానాం సమ్యగధ్యాపకాస్త
౫౦ యః పదవాక్యప్రమణానాం సాహిత్యస్యాగమస్యచ॥ పంచవ్యాఖ్యాకృ
౫౧ త్తో వైద్యకాయస్థా ద్వావిచక్షణౌ। దశానామపి చైతేషాం ప్రత్యేకం పుట్టికా
౫౨ ద్వయం॥ శ్రీవిశ్వేశ్వరదేవస్య నర్తకోర్యదళసంఖ్యయా। ముఖరీద్వయసంయుక్తా

౫3 అష్టౌ మద్దలవాదకాః॥అష్టాదశానా మేతేషాం ప్రత్యేకం సార్ధపుట్టికా।ప
౫౪ కః కాశ్మీరదేశీయో గాయిన్య శ్చతుర్దశ॥ కరడావాదనాద్యేషు కృత్యే
షు రస
౫౫ సంఖ్యయా । పాచకౌ ద్వౌ ద్విజన్మానౌ చత్వారః పరిచారకాః॥ తథైవ
పట్సూ
౫౬ ఖ్యాతా బ్రాహ్మణా వరసత్రయోః । చాతుర్వర్ణ్యస్య సదు ద్భూతా
జటిలాశ్ఛేదదే
౫౭ శజాః॥ బీజచ్ఛేద ... చ్ఛేద ... చ్ఛేదాదికర్మభిః । వీరభద్రసమాఖ్యా
తా దశ ... త్రా
౫౮ మస్య రక్షకాః॥ భటాస్స్య రపకే భక్తా వింశతి స్స్వర్ణమష్టయః । సువ
ర్ణా తాః ...
౫౯ పాషాణ వంశాయస్సుంభకారకాః॥ ఏతే స్థపతి సంయుక్తాః కారునాపిత
౬౦ శిల్పినః । దశ స్వకృత్యం కుర్వాణా భటాస్స్య స్స్వర్ణమష్టిభిః॥ త్రిసప్త
తి మ్మర్ణసప్తా
౬౧ నాం కల్పితా త్వేకపుట్టికా । ప్రత్యేకం పూర్వముక్తానా మారామా
ర్థం చ సర్వ
౬౨ తః॥ ప్రాదాత్ షోడశకం భాగ స్నివర్తన మితత్వేః । గౌడకట్టేనరా
ఢ కుపూ
౬3 ర్వగ్రామ సముద్భవాః॥ శ్రీవత్సగోత్రిణో యేస్స్యు బ్రాహ్మణా స్సామ
వేదినః
౬౪ ఏతేభ్య స్త్రింశతం పుట్టి రదా ద్రాజగురు స్తథా॥ ఏతా ఏతే ప్రభుంజానా
౬౫ గ్రామస్యాయవ్యయాదికం । అనుసందధతాం సర్వం సమ్య గ్లేఖనపూ
౬౬ ర్వకం॥ ఇత్యాహత్య శతం సార్ధం పుట్టికానాం ప్రకల్పితం। కిమ్మతా
మేవస
౬౭ ర్వేషా స్స్వేస్వ కర్మాణి వృత్తయః॥ భవం త్వాచంద్రతారార్క మస్య
థా సభవంతి వా
౬౮ పుత్రాభావే స్త్రియో హ్యేషాం కులాచారసమన్వితాః । కారయంత్వ
స్వకర్మాణి తే

౬౯ త్రారామాది భుంజతాం॥ క్షేత్రాణి శిష్టాన్యఖిలాని దేవదేవాంగభోగాలయ

౭౦ ముఖ్యకృత్యే। ఉపేయుషాం శైవతపోధనానాం శాశానవానాం శివశా
సనానా

౭౧ ం॥ విద్యార్థినాం పాశుపతవ్రతానా మభ్యన్నవస్త్రాదిసమర్పణాయ॥ఆ

౭౨ రఖ్య విప్రానవిపారితానాం చండాలకర్య్యాంత ముపాగతానాం॥ అన్న

౭౩ ప్రదానాయచ సర్వకాల మకల్పయ ద్రాజగురు ర్మహాత్మా। దేవస్య
సత్ర

౭౪ స్య మఠస్య తస్య గ్రామస్య సర్వస్యచ సాధికారీ॥ యోగశకీవంశ్య
కృతాభిషే

౭౫ క శ్శాంత శ్శుచి శ్శైవరహస్యవేదీ। శైవాగమానా మపి పారగామీ
సంతాన

౭౬ పాల స్సకులోష్ట హేమా॥సర్వాణి భూతాన్యనుకంపమానస్సను స్తవిద్యా

౭౭ సుకృతావగాహః॥మహీసురశ్శీలవతాం పురోగో భవత్తరాం నైష్టికదేశి

౭౮ కేంద్రః॥ విశ్వేశ్వరశివాచార్యో ధీమా న్రాజగురుస్స్వయం। ఏవమా

ఙ్ఞాప

౭౯ యద్ధీర శ్శైవాచార్య్య శ్శైత్రవర్య్యతః॥ ఆంధ్రేషు స్థానపతయః షష్ట్యా
మ్నాణ స్తపోధనాః

—మూడవవైపు—

౧ సాంతానికాశ్చ సర్వేత్ర సాక్షిభూతా భవంతు తే॥ శ్రీవిశ్వేశ్వర
గోళకా

౨ మాచార్య్యత్వే ప్రతిష్ఠితః॥ఏతత్సర్వం సదాచారః పరిపాల్యోర్జితం

౩ సదా॥ నిష్ఠానాం శత మాచార్య్యభోగం భుంజీత దేశికః॥ ఉపే

౪ క్షకే స్త్రీ దుష్కృత్తై ప్రఙ్ఞా * * భ క్త * క్తు * * స్తం పరిత్యజ్యసా

౫ ంతానిక మథాపరం। ద * * * త * * తా * * హాయారక్షితా

౬ స్తథా॥ సర్వతీర్థఫలం సర్వజపహోమఫలం తథా। సర్వదేవా
ర్చన

౭ పఫలం ప్రాప్నువం త్యత్ర మానవాః॥ విరుద్ధా విఘ్నకర్త్తారః క్షేత్రద్ర

౮ వ్యాపహారిణః॥ త్రిసప్తకులజై స్సార్థం మన్నపానాద్యభావతః॥ దరి

౯ ద్రాః ప్రేత్య రౌద్రీశ్చ ప్రాప్య ప్రాదశద గ్గణతీః। దుఃఖా న్యనుభవిష్యంతి
౧౦ మహాంతీతి మహాతపాః। విశ్వేశ్వరశివాచార్య స్సదాచారై స్తపోధ
౧౧ నైః। బ్రాహ్మణై రన్యసంఖ్యైరపి గ్రామే స్వభాగాను నా రవా। కృష్ణవేణ్యామ్మ
౧౨ హానద్యాం స్నాత్వా చ మత్యవిధానతః। ఏవం పాకకృతాం శాకం ప్రాదా
త్పుణ్యకృతా
౧౩ ం వరం॥ కృత్వా కాళేశ్వరాఖ్యే పురే ఉపలమఠం పొన్నగామాగ్రహారం
క్రీత్వా
౧౪ విశ్వేశ్వరశివ ఉరుధీ ర్దక్షిణాత్తవాట సర్వ్వ పాత్రీ। నిమ్మాయస్స్వాఖ్యలిగ
మ్మఠ మపి
౧౫ నగరే మంద్రకూటాభిధానే మానేకల్ప్యాట్టుపల్లిద్వయమ దదత సద్దేవస
౧౬ త్రద్వయాయ॥ నామ్నాస్వేన స చంద్రవల్లినగరే లింగం ప్రతిష్ఠాప్యసః
కంచం
౧౭ కల్లితటాకసేతుమధికం కృత్వార్ధ్య మస్మా అదాత్। కృత్వానందపదే స్వ
నామనగ
౧౮ రం ప్రతిష్ఠాప్య చాప్యానందం ముకుకూటముక్యథపురం దేవస్య భుక్త్యై
౧౯ అదాత్॥ కొమ్మూగ్రామే స్వాఖ్యలింగ ప్రతిష్ఠాం కృత్వా త్రింశత్ఖారి
మానాం మ
౨౦ హీః సః। నిమ్నక్షేత్రం కంచఖారీ మితంచ ప్రాదా ద్దేవా యోంగరం
గోకభు
౨౧ క్త్యై శ్రీశైలేశాన్య లీశ్వరపురీసమఠం చ పోడశావరకం। అకరో త్తద్భ
ప్త్యై దాద్గ్రా
౨౨ మం గణపతి రవానిస్త్రాయ॥ విషయే కల్లివాడాఖ్యే కంద్రకోటాభిధాన
౨౩ కం। ఆచార్య్య దక్షిణారూపం తస్మైభక్త్యా సమార్పయత్॥ లింగ
స్నపృత్తై ని
౨౪ ష్మాయ తద్వెల్లాలాంతరస్థలిం। దుద్యాలగ్రామపవ్యాంశం పూసూరుగ్రామ
౨౫ మప్యదాత్। ఉత్తరసోమశిలాయాం లింగం వైశ్వేశ్వరం ప్రతిష్ఠాప్య
పితప్రోల్నా

౨౬ మానం గ్రామం ప్రదా త్సదేశికశ్రేష్ఠః। సామాన్యోయం ధర్మసేతు
ర్నృపాణా

౨౭ ం కాలే కాలే పాలనీయో భవద్భిః। సర్వానేతా న్భావినః పార్థి
వేంద్రా న్భూ

౨౮ యోభూయో యాచతే రామచంద్రః। స్వదత్తాం పరదత్తాం వాయోహ

౨౯ రేత వసుంధరాం। షష్టిం వరుషసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమి

3౦ ః। అస్య సర్వస్య ధర్మస్య పాలకస్య పదద్వయం। విశ్వేశ్వరశివ చా
ర్యోవహా త్యన్వా

3౧ ం సహాత్యలం। మంగళమహా శ్రీ శ్రీ.

---

(41) రసమంజరి—గ్రం. సం 165.

గుడిపాటి కోదండకవి రచించినది. మూఁడుగుచ్ఛములు మాత్రము గలవు. నడుమనడుమం గొన్నిపత్రములు లేవు. ప్రతిగుచ్ఛమునను ప్రథమకుసుమము ద్వితీయకుసుమము అష్టాదశపద్యదళంబుల తృతీయకుసుమము నని భాగము లున్నవి.

సీ. శ్రీకరనందవరీకాగ్రగణ్యుండు వహిమీఱు గుడిపాటివంశభవుఁడు
బిరుదుగా నవఘంటసురధాణిపేరంది మహితుఁడౌ వెంగళమంత్రిపౌత్రుఁ
డతులితుం డగురంగయామాత్యతనయుండు వీరమాంబానందవృద్ధికరుఁడు
సింగనవెంగళశ్రీనిధు లనుజులై భాసిల్లు కోదండపతి ఘనుండు
సరసకవితాచమత్కారసార్వభౌముఁ, డవని శ్రీరంగధాముదయాశ్రితుండు
ఎలమిరసమంజరినిరచియించెనందుఁ, బ్రథమగుచ్ఛంబు మూర్ధ్వశఫణితినమరు.

ఈవంశావళి వివరముగా మొదట నిచ్చియున్నాఁడు, గాని, పూర్తిగా లేదు. అక్కడక్కడఁ గొన్నివిషయములు:—

స్వాధీనపతిక:—అష్టవిధనాయికలయందు స్వాధీనపతిక యనునది యెల్లప్పుడును దనయింగిత మెఱింగి తనయాజ్ఞకు లోనుగా నడిచెడు పతిగలయది. ఈస్వాధీనపతికకు వనవిహారాదులు మదనమహోత్సవములు మదాహంకారములు మనోరథావాప్తులను జేష్టలుగాఁ గలిగియుండు- లక్షణము.

చ. గరిమ కుచంబులం గ్రసిమ కౌనునఁ గాంతిమ యంగకంబులం
బిఱుఁదుల మిక్కిలిం బ్రథిమ స్ఫీతిమ నవ్వుల వాక్పటుత్వముం
వరనటన న్మహాప్రతిమ వక్రిమ చూపుల మందయానముం
బొరపడి లేకయున్న సతి మిక్కిలి చూడ ని దేమి చిత్రమో.

2. అభిసారిక:—తాను నాయకుని గూర్చి యభిసరించునదైన నాయకుని నభిసరింపఁ జేయునదైన నభిసారిక యనందగు, నీనాయకకీచేష్టలు సమయోచితమైన భూషణములు ధరియించునదియు, శంకయు, బుద్ధినిపుణతయుఁ గపటము, సాహసమును లక్షణములు, స్వీయాభిసారికా పరకీయాభిసారికలకుఁ బ్రకృత మొక్కటే యుండును.

ఇందు ముగ్ధాభిసారిక, మధ్యాభిసారిక, ప్రౌఢాభిసారిక, జ్యోత్స్నాభిసారిక, దివసాభిసారిక, స్వీయాభిసారిక, సామాన్యాభిసారిక లనుభేదములు గలవు. అందు స్వీయాభిసారికాలక్షణము.

చ. కులుకుచుఁ దారహారములు గుబ్బల వెన్నెలగాయ సందియల్
ఘలుఘలుఘల్లుమం చనఁగఁ గాంచి ఝుళంఝుళ లుప్పతిల్లఁగా
నలయఁగ దక్కు ప్రాయ యభిసారికవైతి మఱేల తెల్పుమా
సొలయుచు మిక్కిలిన్ బెదరి చూచెద వెంతటిమూఢురాలవే.

3. సకలనాయికులయందును సమమైన సహజానురాగము గలవాఁడు దక్షిణనాయకుఁడు.

ఉ. ముందఱ నున్నవారు పరిముగ్ధవిలోచన లెందఱైన నే
నిందఱియందు నక్షియుగ మొక్కియునిల్పెద నంచు నెంచి తా
నందము మీఱ మీలితదృగంచలుఁడై మధుసూదనుండు నిం
పొందఁగ మేనఁ గ్రొంబులక లూరఁగ నిల్చె దరస్మితుండునై.

ఈరసమంజరి కరూరిలో శ్రీపతికులసుధాకరులైన గానవిద్యాపారంగతులైన కోనుకోలు వేంకట్రాయలవారి తనుజనికొఱకు తిరుమలస్వామి వ్రాసి యిచ్చినది.

ఈపుస్తకములోన మొదట (మువ్వగోపాలపదములు) క్షేత్రయపదములు గలవు. దానికి మొదటఁ బదములపట్టిక యీయఁబడినది. ఇందు 184 పదములున్నవి.

కొంత సాహిత్యలక్షణము గలదు. గణలక్షణములు సాహిత్యరత్నాకరము, సాహిత్యచంద్రోదయము, అలంకారచూడామణినుండి కొన్నిశ్లోకము లిచ్చియున్నాఁడు. పంచమస్థానమందు కకారవిషమాక్షరం యేలూరి శేషయ్య యుంచి చెప్పినకవిత—

చ. మును పాకకేల రావణుఁడు మోదమునన్ రజతాద్రి నెత్తినం
తన హరుఁ డప్పుడే తనపదంబునఁ ద్రొక్కి మదం బడంచెఁ గా
మనమయుగారి తుక్కసచివా నెలశ్రీగిరి గడ్డపాఱలం
గవలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొన నీకును నాతఁ డోపఁడే.

కొన్నిపత్రములు, సంగీతరత్నాకర మని సంస్కృతముగలదు.

శ్లో. సప్తాధ్యాయాత్మకం గ్రంథం శార్ఙ్గసూరిస్వమాతనోత్
శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గీతరసం ఫణి

*అజ్ఞాతవిషయా గోపాల మురళీశబ్దశ్రవణాత్ మారరూపగోచరాత్ । ఆగత్య పరితో గావః పిబన్తి సుషిరామృతమ్ । వ్యాళగ్రాహికగానేన స్థితా అహో,*

కార్వదండవత్ । నిర్భిద్య ర్భోగముద్ధృత్య పిబన్తిస్మ స్వరామృతమ్
అస్తిస్వస్తి గ్రహం వంశ శ్రీమత్కాశ్యపసంభవమ్
యజ్వాభిదక్షభిర్ధుర్యైః వేదసాగరపారగైః
తత్రాభూ ద్భాస్కరః ప్రఖ్యే భాస్కర స్తేజసాంనిధి
అలంకర్తు ర్దక్షిణాశాం యచ్చక్రే దక్షిణాయనమ్.
తస్యాభూ త్తనయః ప్రభూతవినయః శ్రీసాద్గళః ప్రౌఢధీః
యేన శ్రీకరణప్రవృద్ధవిభవాభూవల్ల......
ఇట్లసంపూర్ణముగా నై దాకులుగలవు.

(42)గజారణ్యమాహాత్మ్యము. గ్రం॰ స. 167.

ఇది యొక వచనకావ్యము. కవి పేరు తెలియదు. గ్రంథము పూర్తిగాలేదు. చిట్టచివర కవిపేరు వేసికొనియుండును. ఇదియును దక్షిణదేశప్రతియే దాక్షిణాత్యులందఱును సంస్కృతభక్తినే యధ్యాయములుగా రచించి కొన్ని యధ్యాయముల శ్లోకవ్యాఖ్యానముగాఁ దెనుఁగురీతి ననుసరించువారు. వచనము చక్కనిది. బ్రహ్మపురాణంబున మధ్యమఖండంబున ఉమామహేశ్వరసంవాదంబున నూటముప్పదిరెండవ యధ్యాయమునుండి ప్రారంభింపఁబడినది. 142 వ యధ్యాయము దాఁకఁ గలదు. కొంతశైలికై చూడుఁడు. 139 అధ్యాయములో-

“తదనంతరంబ లోకపితామహుండైన సురజ్యేష్ఠుండు ఫాలాక్షునికిం బ్రత్యక్షుంబుగావించి నమస్కరించి బహువిధంబులం గొనియాడిన భగవంతుండైన యమృతేశ్వరుండు విరించి స్తోత్రంబునకు సంతసించి కమలగర్భా నీతవంబునకు మెచ్చితి వలయువరమ్ము లొసంగెద వేఁడు మనుటయుఁ జతుర్ముఖుండు పంచముఖుఁ జూచి దేవా నీవేనరోవరంబున నావిర్భవించితి వానరస్ను బ్రహ్మపుష్కరిణి యనం బ్రసిద్ధిఁ గాంచవలయు బ్రహ్మపుష్కరిణి తోయంబున మునింగిన మనుజులు దురితవిముక్తులై భవదీయసాయుజ్యంబు నందవలయు- దేవా! ధ్వజారోహణంబు సేయించి నేటిమొదలు నీకు నుత్సవంబు సేయించెద నీ యుత్సవం బాచంద్రార్కంబుగాఁ బ్రతిసంవత్సరంబు నడువవలయు, వానక్షత్రంబైనరోహిణియందు రథారూఢుండవైన నిన్ను సేవించి నీతోడంగూడ నవభృథస్నానంబు సేసిన నరులకు సాయుజ్యంబు గలుగవలయు ననిన”... అమృతేశ్వరుండు నలువపలుకు లాలించి...మాఘమాసంబున మృగశిరానక్షత్రం

బున నుత్సవంబునకు నారంభించి ఫాల్గునమాసంబున రోహిణియం దవభృథ స్నానంబు...ఈ యిరువది యేను దినంబులును నాగమోక్తవిధానంబున శైవా చారసమన్వితుండవై—సేవింపు మని యానతిచ్చిన..."

దీనికిఁ బ్రారంభ మెట్లుండునో తెలియదు. ఉన్న దాని మొదటనే "అంకితం బుగా నాయొనర్పంబూనిన గజారణ్యమాహాత్మ్యంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన" యని మొదలిడినాఁడు. ఈపుస్తకము గరిమల సుబ్రహ్మణ్యశాస్త్రిగా రిచ్చినది.

(43) ఆంధ్రరసమంజరి—గ్రం. సం. 148.

ఈగ్రంథమును పుదుక్కోట గరిమల సుబ్రహ్మణ్యశాస్త్రిగారొసఁగినది యే. ఇందు మొదట శ్రీభానుదత్తమిశ్రవిరచిత మైనసంస్కృతరసమంజరి కల దు. అది రాక్షసనామసంవత్సర వర్షరుతు శ్రావణబహుళత్రయోదశిస్థిరవారం-బచ్చిమిరియం ఆదిప్పయ్యగారి మనుమఁడైన వీణాకుప్పయ్యగారి కుమారుఁ డు వీణసుబ్బయ్య వ్రాసినది. 20 పత్రముల గ్రంథము పూర్తిగాఁ గలదు. తరు వాత నాంధ్రరసమంజరి కలదు. ఈరసమంజరి పుదుక్కోటసంస్థానప్రభు వగు తొండమాను రాజగోపాలభూపవిజయరఘునాథవసుమతీవిభుని సభలోని నారాయణ య్యంగారు రచించినది. సమగ్రము. ప్రారంభము-

క. శ్రీరంగస్థలవక్షః, స్ఫారశ్రీవత్సకౌస్తుభప్రభలంతను
స్సూరులఁ గను స్త్రీకళా, శ్రీరంగస్థలపతిని భజింతును భక్తిన్

ఉ. వల్లభు నుల్లమందుఁ గృతవాస యగుం దనదివ్యదేహము
త్ఫుల్లసితద్యుతి న్వెలికిఁ దోఁచె ననం దదురస్థలంబునం
జెల్లువడి న్నిరంతరము చేరి వసించు సరోజపాణిమ
త్తల్లి యభీష్టసిద్ధి సతతంబు నొసంగ నొసంగు నెంతయున్.

క. వినతియొనరింతు మలయ్యల్లునికి పటనచలితమకుటలుఠదమరధునీ
ఘనతరతరంగబింబిత, వనజారికలాసహస్రవల్గనగతికిన్.

క. కేవలకాంచనకటకవి, భావింప రత్నకటకము,హావిభవులు నన్నయాదు లాంధ్రకవీంద్రుల్......అని

వ. ఎద్దియేని యొకసరసకృతి చమత్కృతి కృతసమున్నతిగ రచియింప మతిఁ బూనియున్న సమయంబున,

సీ. కోటివంశాంభోధికుముదినీరమణుండు కువలయానందైకగుణగణుండు...
కలితనిజనామబోధితకాంతివిభవ, సమరసాహసనత్యాక్రమసమాన
శీలపురుషుఁడు రాజగోపాలభూప, విజయరఘునాథవసుమతీవిభుఁడు మహిని.

మ. ప్రసరచ్ఛాత్రుని నప్పయాఖ్యవరసత్పౌత్రుఁ ద్విషన్నీరద
శ్వసనస్ఫూర్తిని జిష్ణువేంకటమహాచార్యాత్మజుఁ విశ్వవి
శ్వసనీయుఁ స్మరగోవయోగికరుణాసంప్రాప్తసారస్వత
స్వసనాథుఁ ద్వయపూర్వవాక్యముఖసద్వర్ణప్రసిద్ధాహ్వయున్.

మ. ...ప్రతిభోపార్జితకావ్యకల్పను భరద్వాజీయగోత్రుఁ జగ
న్నుతచారిత్రుని నన్నుఁ జూచి పలికెన్..............

మ. సుకవీంద్రుండవు మగ్గుండవు జగన్నుత్యుండ వత్యాదరం
బకళంకాత్ముఁడ వాంధ్రసంస్కృతకవిత్వాగ్ర్యాంతవిఖ్యాతుఁడౌ
సకలోర్వీనుతకీర్తి నీవొక కృతిన్ సంతుష్టుఁడై చేసి వే
డుకఁ గావింపు మిల న్మదంకితము ప్రౌఢోక్తిన్ సుధీంద్రాగ్రణీ.

క. శీలితబుధమానసమధు, పాళి రసానంగహేతువై యలరఁగ వా
క్కేళిని నీరసమంజరి, ఖ్యాళిఁ బ్రకాశింపఁజేసె భానుఁడు జగతిన్.

క. ......ఆ,రసమంజరి తెలుఁగొనర్పు రసికులు పొగడన్

వ. అని రాజుపలుకఁగా నీకవి యాంధ్రీకరించెను. కృతిపతివంశావలి విశే
షముగ వర్ణించియున్నాఁడు. నాలుగాశ్వాసములు– ప్రత్యాశ్వాసాంతము
నను గద్యము, పద్యరూపమున రచించెను. చిట్టచివర–

శా. వన్నెల్మీఱఁగ నుల్లసిల్లిన భరద్వాజీయగోత్రార్ణవో
త్పన్నశ్రీఁగొనుసూరిచంద్రుఁడు దలిర్ప న్వేంకటాచార్య శ్రీ
మన్నారాయణసత్కవీంద్రుఁ డొనరింప న్రమ్యమై యాంధ్రమై
యెన్న న్నా రసమంజరీకృతిఁ జతుర్థాశ్వాస ముప్పొందగున్.

వ. అనియున్నది. "నవసాలపురమునను౦డే వడమటినగరధోరపై యంకితము
గా శ్రీమన్నారాయణయ్యగారు చేసిన రసమంజరి యను గ్రంథము–"
దీనినిగూడ వీణె సుబ్బయ్య యే రాక్షసనామ సం॥ శ్రావణశు॥ షష్ఠికిఁ
బూర్తిగ వ్రాసెను. దీనితరువాతను సంగీతరత్నాకర మను సంస్కృతగ్రంథ
ము కొంత కలదు.

"భరతాఖ్యసుధాసింధుసంభూత ఇవ కౌస్తుభః
రఘువీరపదాంభోజమిళిందశుచిచేతసా
గోవిందనామ్నా సంగీతశాస్త్రః స_ క్షేపతోచ్యతే" ఇట్లు —

28 పత్రములుగలవు. కపట- ద్విసప్తతితమే భేదే రసికప్రియనామకమ్ తజ్జాతం రసమంజర్యా రాగద్వయ మితీరితం ద్విసప్తతితమే వాళ్ళజాతం రాగః ప్రకీర్తితాః" శ్రీరామజయం అనియున్నది.

(44) హాలాస్యమాహాత్మ్యము. గ్రం. సం 170.

ఇది యొకవచనకావ్యము దక్షిణమధురాక్షేత్రమాహాత్మ్యము. 71 యధ్యాయము. 8 ఆశ్వాసములుగ రచియింపఁబడినది. అధ్యాయాంతంబుల "ఇతి శ్రీస్కాందే మహాపురాణే హాలాస్యమాహాత్మ్యే... అధ్యాయః" అనియున్నది. ఆంధ్రీకరించినకవి- శ్రీపతి రామభద్రకవి- ఇతఁడు తనగద్యము నీక్రిందివిధమున వ్రాసికొనియెను.

ఇతి శ్రీమీనాక్షీసుందరేశ్వరసాంద్రకృపారసఁబ్ధ కవితామాధురీధురీణ కాశ్యపగోత్రాశ్వలాయనసూత్ర శ్రీపతికులపవిత్రచరిత్ర శ్రీగిరియమాంబాసత్పుత్ర సూరయామాత్యపుత్ర కవిరామభద్ర ప్రణీతంబైన హాలాస్యమాహాత్మ్యంబునందు వచనకావ్యంబున... ఆశ్వాసము."

కవి దక్షిణదేశస్థుఁడు. పుస్తకము దక్షిణదేశమునుండి వచ్చినదియె- వచనము సంస్కృతజటిలముగ నున్నది. వ్రాఁతపొరపాటులు గలవు. ఉభయభాషలయందును యమకములు తఱచుగాఁ గనఁబడును. కొన్ని పంక్తు లుదాహరణమునకై చూపఁబడును.

"అశ్వినీదేవతలు చూచి యిది యపరిహార్యం బగిన నిరుద్యోగులై జాగులైరి. తద్రోగపరిహారార్థంబుగా నొక్కయుపాయంబు దేవరానతీయవలయు ననిన వరుణముఖావలోకనంబు చేసి వాసవుండు విను మోసంబు లే దనిసుధా పారసమానవచనంబులు పలికినపుడు- ఏమహావ్యాధిపీడితులై పాపకృత్యులై యపమృత్యుపీడితులై కాలమృత్యువశులైనవారెవ్వరో వారందఱు సుందరమూర్తి సందర్శనంబునఁ బునీతు లగుదురు గావున మనోవాక్కాయపరిశుద్ధులై యాయభిషేకపాండ్యరాజాగ్రణి భక్తిప్రభావంబును, ఆదేవుని మహిమాతిశయంబును నీవు తెన్నెఁగఁ బరీక్షించి తెలిసి తల్లింగార్చనంబు గావించితివా యొనా నీరోగంబు తొలఁగు నిందుకు సందియంబు లేదు. అనిన శక్రునివాక్యంబులు విని

వరుణుండు చొక్కమని యాచొక్కనాథుని శోధింపఁ దలఁచి గ్రక్కున లేచి యతనికి మ్రొక్కి మక్కువతోడ మిక్కిలి యెక్కువైన హర్షపరవశుఁడై చక్కఁ దనపురంబునకుఁ జని యంత నొక్కనాఁడు- ఆరాజును సుందరరాజును జక్కన శోధింపఁదలంచి వరుణుఁడు సముద్రుని బిలిచి సముద్రగనిద్రలేచి నీయందుఁ గలజలచరపరివృతుఁడవై యనేకతుంగతరంగావృతంబుగ నామధురానగరం బుఁగబళింపు మనిన-"

పరిమత్పుస్తకభాండాగారములో నంజరాజకృత మైనహాలాస్యమాహాత్మ్యవచనముఁ గూడ నున్నది.

ఈరామభద్రకవిగ్రంథము "కర్ణపురీక్షేత్ర నిత్యనివాసు లగు బ్ర॥ శ్రీలక్ష్మీనృసింహసూరిసపుత్రిందును శ్రీలక్ష్మీనృసింహార్యపౌత్రుండును శ్రీరామార్యవర్యుల పుత్రుండు నగు నందవగోత్రాశ్వలాయనసూత్రుండు నగు శ్రీసీతారామయ్యది." అని మొదలఁగలదు. వ్రాతచక్కనిది. మంచిస్థితిలో నున్నది.

(45) హరివంశము. గ్రం. సం. 4534.

ఎఱ్ఱాప్రెగడరచించిన పూర్వోత్తరభాగములతోఁగూడిన యొకతాళపత్రగ్రంథము. ఇం దుత్తరభాగమున, చతుర్థాశ్వాసము తరువాత 5, 6, 7 ఆశ్వాసములు నేమానిభైరవికవి రచియించినవిగలవు. ముద్రితప్రతులలో నివిలేదు. 8 వ యాశ్వాసము, ఎఱ్ఱాప్రెగడ పంచమాశ్వాసముక్రిందను లెక్కింపఁబడు చున్నది. ౨౦౯ పత్రము మొదలు పంచమాశ్వాసము ప్రారంభమున- ఈ మీఁదట నేమానిభైరవావధాన్లకవిత్వము" అనికలదు. ౨౧౫ లో నాల్గవపంక్తిలో "యీమీఁదట యర్రయకవిత్వము" అనియున్నది. ప్రారంభము-

ఉ. శ్రీరమణీయకౌస్తుభశుచిప్రభలందున బింబితాంగియై
శ్రీరమణీలలామ తనచెక్కిటఁ జెయ్యొఘటింపఁగాంచి య
బ్జోరపుటల్లఁ దీర్పుతఱిఁ దొయ్యలిపాదములంటి యంటి వే
మారును మారుకేళి బతిమాలెడువెన్నుఁడుఁ మమ్ముఁబ్రోవుతన్.

చ. వరగుణశాలి కోటగిరివంశభవుం డగుశ్రీనివాసభూ
వరుఁ డతిభక్తితోడ హరివంశకథాశ్రవణైకచిత్తుఁడై
యరయుచుఁ బారిజాతహరణాదికథావళి లేకయున్నచో
సురుచిరదృష్టిచేత ననుఁజూచి దయామతితోడ నిట్లనున్.

గీ. ఎఱ్ఱనార్యుండు తెలిఁగింపఁజేలనొక్కొ, తెలుఁగుఁ జేసినవిదవను దొలఁగెనొక్కొ
యీకథలునీవు దెలిఁగింపుమింపుమీఱఁ, బ్రకటనేమానిభైరవసుకవిచంద్ర.

క. వేంకటభర్తకునీకృతి, వంకితముగఁ జేయునేతయగు నాతని హే
మాంకితరుచిదేదీప్య, త్కంకణగత మైన కెంపుకరణిం బొలుచున్.

వ. అనిపలికి, తాంబూలాంబరజాంబూనదాగ్రహారాదిప్రదానంబుల నాదరిం
చినఁ బ్రహృష్టాంతరంగుండనై షష్ఠ్యంతములం జెప్పెద-

అని షష్ఠ్యంతంబులు రచించెను. పైదానింబట్టిచూడ నీకవి పారిజాతాప
హరణాదికథ లింకఁ జెప్పి చేర్చియున్నట్లు తెలుచున్నది. భైరవకవి తనమూఁ
డవయాశ్వాసము పూర్తిచేయలేదు. చివర-

క. "హరిగరుడారూఢుండై, సురనగరీతులితభద్రశోభాంకితమై
మెఱసిన తద్ద్వారవతీ,పురమంతటఁ జూచె నపుడు భూపతితిలకా."

ఇట్టి భైరవకవికడపటిపద్యమును,

వ "అట్లుగాంచి భగవంతుండైన హరి మణిపర్వతయంత్రంబులను క్రీడాగృహం
బులును-" ఇత్యాది యెఱ్ఱాప్రెగడ వచనముతో సంబంధముకలిపెను. పైలి
పై రెండుపద్యములు-

ఉ. ఆతతకీర్తి కాశ్యపవరాన్వయజాతముఁ తోట మీఁరు మ
ద్ర్యాభతలు దేవపుణ్యజనభాసురదివ్యవిమానవాహవి
ఖ్యాతము లైతిరేకద సురాళికి శత్రువహ కార్యసాధనం
బీతతిఁ జేయఁగావలయుఁ జేయుఁడు కూడదు మంత్రభేదముల్.

మ. హరిపై చేల్ దివిజారినాథుకయిఁ గోపాటోపమేపాఱఁగా
నిరవద్యామితకాంతిదర్శనదశాంధీభూతభూచక్రముల్
శరణార్థీంద్రముఖామరావనలసత్సౌలభ్యనిర్వక్రముల్
వరధారాహతఘోరరాతుసవిభాస్వన్నక్రముం జక్రముల్.

గద్యము. ఇది శ్రీమత్కల్యాళిగౌరీచరణసరసిజషట్పదాయమానమా
నసోభయకవితాసార్వభౌమబిరుదాంక వేంకట భట్టారకపౌత్ర సూర్యనా
రాయణ సోమయాజిసత్పుత్ర వితుందినసగోత్రపవిత్ర నేమానిభైరవావ
ధాని ప్రణీతం బైన హరివంశంబునందు......ఆశ్వాసము.

"ప్రమోదూతనామసంవత్సర శ్రావణబహుళ ౧౦ శుక్రవారము
వరకు రాజశ్రీ రావు రామయ్యగారికుమాళ్లు వెం.కయ్యగారు హరివంశము
యిరవైమూడాశ్వాసాలు రాజశ్రీ కోటగిరి శ్రీనివాసరాయఁగారి ప్రతిస
సంపూర్ణంగాను వ్రాయించిరి-" ఈపుస్తకమును, పెండ్యాల వెంకటసుబ్రహ్మ
ణ్యశాస్త్రిగారొసంగిరి.

పరువున నేగి యొక్క చెలి పయ్యెదఁబట్ట నదల్చినంతలో
సరసములాడుచుం గుచకుంభముల రెంటిని గేలుదోయిచే
సరగునఁబట్టి మోవిగొని సాహసమేర్పడఁ గ్రోలినట్టి మం. ౪౭

కర మనురక్తి నొక్కసతి కాంచన రమ్యఘటంబు మస్చితాఁ
బెరుఁగు మథించుచుండఁ గని పెల్లున నేగి పిఱుందఁ జేగి నే
కరములఁ గాది చన్నుఁగవ గట్టిగఁ బట్టఁదలంచినట్టి మం. ౪౮

పురుషుఁడు నిద్రవోవుతఱిఁ బోయి పెస న్మఱుఁగంబు వానిపె
న్నురమునఁ బెట్టి వాఁడదరి పాటొయుని పాఱఁగ నందు చిక్కి వం
చురవడి వానితో యాలిని నొప్పఁగ మన్మథకేళిఁ గూడు మం. ౪౯

సరసిజపత్రనేత్ర యొకసందున జల్లములాడుచుండఁగా
బిఱబిఱ నేగి పిల్లలను బిందుగఁ గూర్చుక గేలిచేయుచుం
గరములఁ దట్టుచు న్సతిని గన్నులుమూసికొఁ గౌఁగిలించు మం. ౫౦

తరుణి యొకర్తు వెన్నకడఁ దద్దయుఁ జేయుచు వంగియుండఁగా
సరసకు నేగి పన్నగము సాహస * *

* * * *

సరసిరుహాక్షి యొక్కతె పెసన్

* * * *

నిరతము నిట్లు చేయఁ గని నీరజగంధులు కల్లు రత్తిజేఁ
వరుసఁగఁ గూడి వాఁడిటకు వచ్చిన బట్టుద మంచు నుండఁగా
పరమర లేకపోయి యట నందఱుసిగ్గులుఁ గొల్లలాడు మం. ౫౩

వెఱచినవాని కైవడిని షేటొకగోపికపుత్రు వేణికిన్
మఱియొక బాలు పెన్నిగకు మర్మముగా ముడివెట్టియంత బా
లుర గుమిగూడి నవ్వుచు నలూఖలమెక్కుచు నృత్యమాడు మం. ౫౪

త్వర నొకగోపభామిని ముదంబునఁ బాడుచుఁ జల్లచేయఁగాఁ
బరువులుపాట్లుగా నరిగి బాన కెగంబడి జుట్టుకోఁగనా
తరుణి యదల్ప నాకరము దానిముఖాబ్జమునందు రాయు మం. ౫౫

సరసని నాటకుం జని పెసన్ జలకంబుల నాడుచుండఁగాఁ
బరువడిఁ బోయి చేలములుఁబట్టి జరీయుత కంచుకంబులుం
దరుణు లెఱుంగకుండఁ గొని తత్క్షణమే సురపొన్న నెక్కు మం. ౫౬

కరిగమన ల్జలంబుల విశాలమనంబులఁ గేలిసల్పి వే
గిరమున గట్టుఁ జేరి యిటు కృష్ణుఁడు వచ్చునటంచుఁ జేలముల్
బిఱబిఱఁ జూడ లేమి గని బెగ్గలమొందఁగ వేణువూఁదు మం. ౧౩

కరముల నెత్తి మ్రొక్కు లిడఁ గంచుక చేలము లెల్ల మీఁకు నేఁ
గరుణ నొసంగువాఁడనని గట్టిగఁ బల్కిన వారలట్లని
స్మరణ మటంచు మ్రొక్కిన వెసం గృపఁ జేలము లిచ్చినట్టి మం. ౧౪

మురియుచు నొక్క గోపసతి ముద్దులుగుల్కఁగఁ బాటపాడుచు
న్నాసుఁడు రాఁ డటంచు మదిఁ జాల విరాళిని బొందుచుండఁగాఁ
బరువడి నేగి యాచెలినుపాయముతోడ వరించినట్టి మం. ౧౪

మఱచియు నిద్రపోవుతఱి......

వరసఖ శైశవక్రియల నందఱు మెచ్చఁగఁ గ్రీడ సల్పుచున్ ౧౯
నిరతము గోపికామణుల నెయ్యముఁ దీర్చి కుచాగ్రసీమపైఁ
బొరలుచు మోవియానుచును బొందుగ నుండెడి చిన్నినెంతు మం. ౬౦

* * * *

సురవరబుద్ధసంభవత్రిశూలులు మెచ్చి నుతింప నవ్వెడ
వ్వర త్రితయాంగనామణుల బొంకఁగఁ జేయను బుద్ధరూపవై
తరుణుల మానము ల్గొనిన తండ్రివి నీకు జొహారు ప్రోవు మం. ౬౧

ధరఁ గలిరాక్షసాదుల వధం బొనరింపను గల్కిరూపవై
కరముల ఖడ్గఖేటకముఖాయుధముల్ ధరియించినట్టి శ్రీ
హరియిదె నీదు దాసుఁడను నంజలి చేసెద నప్రమేయ మం. ౬౨

*ధరఁ జనియించువెల్లఁ బరదారధనంబులఁ గోరునందుకా
తెరువునఁ బోవువారలను దేఁకి కనుంగొని మోహమందనా
విరసములాడి పెద్దలను వృద్ధుల గొట్టుట కాసుతుండు మం. ౬౩

వరుసగ లేనిదంతములుఁ; వాదులు మెచ్చనికల్లు సున్నముల్
మఱచెడువాని విద్య; వలుమాఱును దెప్పెడు వానివిందు బల్
దురుసుల నాఁడు సోదరుఁడు; ద్రోహిసఖుండిలఁ గూడదండ్రు మం. ౬౪

* ఇక్కడనుండి నీతిమార్గపద్యములు.

తరుణిని బాలు వర్ణ్యమును దాసుని దండన సేయకుండినం
బొరుగులకేగు వ్యాజ్యములు బోరనఁ దెచ్చునుఁ గ్రిందఁద్రోయుఁ జేఁ
పురునటనుండి తెచ్చును వపోహముగాదు నిజం బిదెల్లయు. ౬౯

గురగురలాడునోరు, పతికోపము చేయ నెదిర్చి మిక్కిలి
న్వైరసములాడు భార్య, సుకవీంద్రులు మెచ్చని యాకవిత్వముం
బొసగున నవ్వఁ గుత్సితులపొం దతిహీనత కూడదండ్రు మం ౭౦

నిరతము ధర్మహీనులకు నీతియొకర్వుకు గర్గి పెద్దలన్
గురులఁ గవీంద్రుల న్నరసి కొంచెము గొప్పయొనర్చరించునే
మరణము నొందు నద్దినమయమునకుఁ గుసనసే మఱి గర్వ లివ్వయు. ౭౧

పరసుఃతు మెచ్చనగ్ని పతి, సంభ్రమచేష్టలు, విత్తహీనుల
న్నరగిన వేశ్య, ద్రోహి యగునుంతిని నుంచిన రాజు, పుత్రుపైఁ
గరుణయు లేని తల్లి తుదిఁ గష్టముఁ దెచ్చును వెట్టవచ్చు మం. ౭౨

వరకవికివ్వనగ్ని ధనవంతుని పంపద యేటిమొత్తునం
బెఁగిన న్నూరు నొడయున పెన్నతటాకమునందునీరు నీ
ధరనిలువంగఁబోదు కరిదా భుజియించు కపిత్థమట్లు మం. ౭౩

దురితము చేయరాదు పతితోఁ గలహింపఁగరాదు పెద్దల
న్వైరసము లాడరాదు పరవిత్తములన్ గ్రహియింపరాదు మిాఁ
దరయక త్రుళ్లరాదు భువి నల్పులసఖ్యము చేయరాదు మం. ౭౪

నరపతి లేనివాఁడు హరివాసము చింతన లేని వీడు తా
నరయునిత్తోడు పాదమున కబ్బనిజోడు భుజించు మాత్రనే
ధర న్మృతిఁ బొందు కూకుట యథార్థముకూడదు కీడటండ్రు మం ౭౫

హరిగుడి లేని పేట జనులందఱు కాల్వడ లేనిబాటఁ గ
న్మరియిలు లేని వీట మతిమంతులు పాలన లేని కోటఁ నే
విరులును లేని తోఁట సభివృద్ధికిరా వట నుండరాదు మం. ౭౬

తరుణుల నమ్మరాదు తనదాన మహాత్మ్యఁ దనంగరాదు తాఁ
బరిపరిత్రోవలం దిరిగి బాధల నొంది కృశింపరాదు శే
మఱి కనుమూయరా దసని మధ్యను జాలము సేయరాదు మం ౭౭

తిరిపము వెత్తువారిఁ గని దిగ్గున లేచి పటంబుఁగట్టి తా
నరగున వచ్చి దంతములు సారెకు గీటుచుఁ గంట నిప్పులం
గురియుచు హుమ్మటంచు నిటఁ గూయుకు పొమ్మను దుష్టుఁ జంపు మం ౭౮

సిరి యిదె చాలునంచు భ్రమ సింధుర మెట్టులు క్రొవ్వి మెట్టులుం
గరుణను జూడక న్నిగుల గర్వము నొంది తిరస్కరించునా
దురితులు ముక్తిహీనులయి త్రూలుదురా నరకంబునందు మం. ౭౯

హరిని మహానుభావుఁ డని యచ్యుతుఁ డవ్యయుఁ డప్రమేయుఁ డీ
శ్వరుఁ డని పాటపాడుచును శాంతముబొంది ధరాతలంబుపైఁ
దిరుగుచునున్న సజ్జనులఁ దిట్టుచు దుష్టులఁ గొట్టుమయ్య మం. ౮౦

హరిభజన ల్సహింపక యహర్నిశముల్ ధనకాంక్షచేసి యే
వెరవునకైనఁగాని యిల విత్తము నార్జనచేసి ధర్మము
న్మఱచు దురాత్ములంగలయు మందుడు చేరఁడు మోక్షమందు మం. ౮౧

దొరలతో చాడిచెప్పుచును దుష్టచరిత్రము చాలఁ జేయుచు
న్నరులకుఁ గానివాఁ డగుచు నైజగుణంబులు మానకుండఁగా
విరసములాడు మానవుల వెంగలిబుద్ధుల మాన్పరయ్య మం. ౮౨

నిరతము నిన్ను నెన్నకయు నీపదభక్తులఁ జేరకుండఁగం
బరువడి దానధర్మము లపారదయామతిఁ జేయకుండఁగం
బరులకుఁ గీడుసేయుచు నపంబిడుదుష్టుల రట్టుసేయు మం. ౮౩

కురకురలాడి భక్తజన కోటుల దూషి హసించువానినీ
చరణయుగంబు నమ్మి మతినల్పుచు నుండెడువారి కావదల్
త్వర సముకూర్పవత్తి పతితాత్ముని త్రుళ్ళడఁగింపుమయ్య మం. ౮౪

పురుషుడు క్షత్రియుం డగుచు భూమిని యున్నతి పుట్టగావలెన్
ధరను మహాత్మపాదములు తద్దయు భక్తిని బట్టఁగావలెన్
దురమున శూరుఁడై రిపులఁ ద్రుంచి యశంబునుబొంద మేలు మం. ౮౫

గురువులఁ దల్లిదండ్రులను గోవులఁ బూజయొనర్పఁగావలెం
బరహితము న్మది న్నిలిపి భక్తిని బెద్దల కన్నమిచ్చి తా
వరుసభుజించి పుణ్యుఁ డనువార్త వహించుట మేలుగాదె మం ౮౬

* నిరతము నిన్నుఁ గాంచుటకు నేరక సద్గురుఁ గానఁబోక యే
తెఱువుఁగనంగలేక తనదేహము సుస్థిరమంచునమ్మి యీ
ధరనటియించువారలకుఁ దారకయోగమదేల నయ్యా మం. ౮౭

* ఇంతటినుండి జ్ఞానమార్గము.

పరమగురూత్తముం గదిసి పాదయుగంబులు బట్టి భక్తితో
పురుషుఁడు చూపుమార్గమును బొల్లక లోనిప్రపంచమెల్లసా
దరముగఁ బాయువారలకు దబ్బిలియీవెలిగాధశైల మం. ౫౮
స్థిరమతితో రహస్యముగ సిద్ధప్రదేశమునందుఁ జేరి స
ద్గురువరు నాజ్ఞచొప్పునను గూరిమితోడుత నొక్కపాదము
న్సరగునవంచి యామడమఁ జక్కఁగ మూలముఁ జేర్పమేలు మం. ౫౯
అరమర లేక వాయువును నంతట స్తంభన చేసి తిన్నగా
నెఱుకను దొల్తనుండు గిరి నెక్కిగజానను గాంచునట్టి యా
పురుషుఁడు పుణ్యుఁడౌ నతనిఁ బోలరు మానవు లంటివయ్య మం. ౬౦
సరగున దాని దాఁటి తన సాహసమేర్పడ స్వాధిష్ఠానమ
ద్గిరి నివసించి యచ్చటను కేవలభక్తిని దన్మిమాలిని
స్వరుననుగాంచి మ్రొక్కు బుధవర్యుఁడు శ్రేష్ఠుఁ డటంటివయ్య మం. ౬౧
మఱి మణిపూరకాఖ్యమల మారుతవేగముతోడనెక్కి యా
గిరినివసించు నచ్యుతుని కేవలభక్తినిగాంచిమ్రొక్క శ్రీ
ధరజయ మొందినట్టి సుకృతాత్ములు పెద్దలటంటివయ్య మం. ౬౨
వరుసగ దాని కావలను వాసి యనాహతకొండఁ జేరి యా
హరునటఁ గాంచి మ్రొక్కి వినయంబున నంజలిచేయువారలే
పరమకృతార్థులౌదురని పంకజలోచన తెల్పితౌర మం. ౬౩
పరువడి నావిశుద్ధమను పర్వతమెక్కి మహేశుఁగాంచి యా
పురుషునకుం బ్రదక్షిణముఁ బాటిగఁ జేసి నమస్కరించు నా
నరసులు ముక్తులౌదురని చాటుచుఁ బల్కవె దేవదేవ మం. ౬౪
త్వర నదిదాఁటి యాజ్ఞ యను దొడ్డగిరీంద్రము నెక్కి యచ్చట
న్వరుసగ నానదీత్రయము వాంఛను గాంచి సలక్ష్యమార్గులై
పరువడిమన్ముఖుం గనిన భవ్యులు నావలె నంటివయ్య మం. ౬౫
వరగుణశాలివై సకలవాంఛల నెల్లను మాని ముందు స
ద్గురుకృప వేయిశృంగముల కొండను జేరి ప్రచండమూర్తివై
హరి నినుఁ గాంచువాఁడె ఘనుఁడౌ గురుఁడౌనని పల్కలేద మం. ౬౬
సరగున షణ్ముఖాంజనము సాహసమొప్పఁగఁ గంటఁబెట్టిలోఁ
గురుతులు చూప మార్గములఁ గొండలుఁ బల్లెలు దండ్రిగ్రామముల్
చెఱువు లరణ్యముల్గనిన సిద్ధుఁ డనఘుఁడనంటివయ్య మం. ౬౭

విరివిగ శాంభవాంజనము విక్రమలీల ధరించి యంతట
స్సరసిజమిత్రమండలముఁ జందురు మండల మగ్నిమండలాం
తరములఁ జూడవచ్చునని తద్దయుఁ బల్కెడి ముగ్ధులయ్యె మం. ౯౮
సరసతఖేచరాంజనము సాహస మొప్ప ధరించి చూడఁగా
పరపుర లేక ముక్తి నిలయంబున నుండెడు శోభనాంగి పే
రురమునఁ జేరవచ్చునని యుద్ధతిఁ బల్కెడి చిద్విలాసమం ౯౯
సురనుత భూచరాంజనము సొంపుగఁ దాల్చిన నల్ల వేమకల్
సొరిదిఁగనంగవచ్చు ఘటశోధకుఁడై వెలుఁగంగవచ్చు నే
మరక ప్రపంచము స్సకల మర్మములం గన నౌనటంటి మం. ౧౦౦
ఈసుగుణశాలులై వడిగ నుత్తరశాంభవిముద్రతోడ భా
సురముగ సర్వజంతు సమశోభితహృత్కమలంబునందు నా
హరిహరు లబ్జగర్భ సురలాది పరాత్పరుఁ గాంతురంద్రు మం. ౧౦౧
వరమతి నై మనోవిజయ వైభవుఁడై కరణక్రియంబులం
గలకలఁ గ్రోధవాసనలఁ గాలిచి శత్రుల గెల్చువంత నీ
చరణసరోజము ల్గనుట సత్యము సిద్ధమటంటి వయ్య మం. ౧౦౨
అరుదుగఁ జిమ్మచీఁకటిని నబ్బరపాటును బొందకుండఁగా
మెఱపుల కుప్పలై పడిని మెండగు దివ్య వెలుంగు నందు నీ
వరరుచిరప్రమూర్తిఁ గనువారలు నిత్యులు ముక్తులంద్రు మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౧౦౩
వరగుణశాలి బాలయకు వారిజలోచనలక్ష్మమాంబకే
వరతనయుండఁ గృష్ణకవి వైభవ మొప్పఁగ వృత్తపద్యము
ల్సరవి రచించితి న్సుకవిసంఘము మెచ్చఁగఁ బ్రోవు నన్ను మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౧౦౪

ప్రభవనామసంవత్సరమార్గశిరశు ౧౧ తిరిమెల అప్పలాచార్యులవారి కుమా
రుఁడు రంగాచార్యులు వ్రాసిన ప్రతినిబట్టి.

# పరశురామశతకద్వయము.

పరశురామపంతుల రామమూర్తి.

—। ఆటవెలఁది-గీతపద్యములు ।—

శ్రీశు నీశు భారతీశు భజించి విఘ్నేశుఁ గొలిచి కవుల నెంచి యొక్క
గీతపద్యశతము గీర్తింతు వినుమురా, పటుగుణాభిరామ పరశురామ. ౧
హరిహరాత్మలగు మహాదేవగురులింగ, మూర్తిపాదకమలములకు మ్రొక్కి
తన్మయుండగుయుక్తి తగ నెఱింగింతురా, పటుగుణాభిరామ పరశురామ. ౨
ధరణి లోకశాస్త్రతనువాసనాబద్ధుఁ, డగుచు విహితకర్మ మాచరించు
సద్ద్విజుండ ననెడి జనుఁడు మూఢుండురా, పటుగుణాభిరామ పరశురామ.
కాయ వాఙ్మనములు గలిపి సాత్త్వికవృత్తి, నీశ్వరార్పితముగ నెల్ల క్రియలు
సలుపునిర్మముండు సాధువిప్రుండురా, పటుగుణాభిరామ పరశురామ. ౪
విష్ణుమూర్తిరతుఁడు విష్ణుకథార్చన, ధ్యానకీర్తనామృతాతురుండు
పరమ విష్ణుభక్తివరుఁ డుపాసకుఁడురా, పటుగుణాభిరామ పరశురామ. ౫
గురులనాశ్రయించి కోరి స్థానాంగభా,వాత్మసేవ లార్తి నాచరించి
పావనాత్ముఁ డతఁడు పరమభక్తుండురా, పటు. ౬
భక్తి గలుగ సకలపాపంబు లణఁగును, పాప మణఁగఁ గలుగు భావశుద్ధి
భావశుద్ధిగలుగఁ బరమార్థ మబ్బురా, పటు. ౭
బహుప్రపంచకాంక్ష పరిహార మొనరించి, పారమార్థికేచ్ఛ ప్రబలమైన
ధీరుఁ డాగురూపదేశ యోగ్యుండురాఁ పటు. ౮
మంత్రమర్మ మెఱిఁగి మంత్రోపదేశతం,త్రం బెఱింగి శిష్యధర్మ మెఱిఁగి
తదుపదేశ మిచ్చు ధన్యుఁడే గురుఁడురాఁ పటు. ౯
తన్నుఁ దా నెఱింగి తనరూప మొకరికిఁ, దెలియఁజెప్పనేర్పు దెలిసి కరుణ
బోధసేయువాఁడె బో సద్గురుండురాఁ పటు. ౧౦
తనువు నిజముగాదు తా నిజంబని మది, నెఱిఁగి పారమార్థ మిచ్ఛయించు
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరాఁ పటు. ౧౧
ఇహసుఖంబు లిచ్ఛయింపక వర్జించి, పరసుఖంబు లాసపడక మించు
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరాఁ పటు. ౧౨

కరణములఁ గెలిచి కర్మంబువరమించి, మోక్షశ్రద్ధ గలిగి యుక్తిఁ దగిలి
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరాఁ పటు. ౧౩

అన్యపదవు లొంద నభిలాష సేయక, యమృతపదవి నొందనాసపడెడి
సజ్జనాశ్రయుండు శ్రవణాధికారిరా, పటు ౧౪

సద్గురుండు నిట్టు సచ్ఛిష్యవరునకు, బోధసేయు తత్త్వబోధ నీకు
నెఱుఁగ వరుసతోడ నెఱిఁగింతు వినుమురా, పటు. ౧౫

మును యమాదియోగములు సాధ్యములుగావు, సాధ్యమైనమహిమ సంభవించు
మహిమలబ్బ ముక్తిమార్గంబు దప్పురా, పటు. ౧౬

తనకుఁ బరున కద్వితాదాత్మ్య మొందించు, నదియె రాజయోగ మదియుఁ ద్రివిధ
మయ్యె సాంఖ్యతారకామనస్కము లనఁ, బటు. ౧౭

చిత్తచలన ముడుగఁ జిత్కళా నాదసం, ధాన మందఁ జేయుఁ దారకంబు
పొసఁగ సాంఖ్యమునకుఁ బూర్వాంగ మదియురా, పటు. ౧౮

స్వానుభవము గలుగ సంసారదుఃఖంబు, శాంతి నొందఁ జేయు నదమనస్క
యుక్తి సాంఖ్యమునకు నుత్తరాంగంబురా, పటు. ౧౯

అట్లుగానఁ దారకామనస్కములకు, ముఖ్యమతిశయంబు మోక్షదంబు
సాంఖ్య మదియు మొదల సాధింపవలయురా, పటు. ౨౦

పుడమి నొక్కజనుఁడుఁ బుట్టక మునుమున్నె, బొడమ జనము సమసిపోవు
దుదిని దిక్కుమాలి యొక్కదేవుఁడే యుండెరా, పటు. ౨౧

అతఁ డేకమనెడి యాగమార్థంబుపై, వెలసి సృష్టిమొదట వేద్యుఁ డయ్యె
శాస్త్రమున నఖండ సత్యాదిరూపుఁడై, పటు. ౨౨

ఏక మయ్యె నతఁడు లేకుంట సేవకా, ర్థమయ్యె విమలుఁ దబ్బకుంట
నద్వితీయుఁ డయ్యె నగుణుఁడై యుండుట, బటు. ౨౩

ఇదియు నదియు నట్టి దిట్టి దింతింతని, పలికి చెప్పఁ జూపఁ దలఁపరాని
బ్రహ్మమగుచుఁ దాన పరిపూర్ణుఁ డగునురా, పటు. ౨౪

దేశకాలములకుఁ దెగక వస్తువులగు, భూతభౌతికముల పొలుపు లేక
నిండియుంటఁ దానఖండరూపుండురా, పటు. ౨౫

ప్రకృతిభూతములును బ్రహ్మాదిసురులును, జనమృగాదులెల్ల సమసిపోవ
సమయకుంటఁ దాన సత్యరూపుండురా, పటు. ౨౬

సీ. రమణీయనాయకరత్నంబు వంటంగ హేమవల్లికి వేళ యిదె యటంచుఁ
చంద్రరేఖకు సబ్బసాంద్రాంధకారాభచికురముల్ దెరలించు వేగ యంచుఁ
గృష్ణమేఘముచెంతఁ గీల్కొని మెలఁగంగ విద్యుల్లతకుఁ జాలువెర వటంచు
సిదె సర్వమంగళాస్పదునాదలంటంగ మందాకినియె నేర్పుఁ జెందు నంచు
విధుని సేవింపఁగను దార విత్త యనుచు, నీలవేణియె గోవిందు నెలవటంచు
వంబుజాక్షులు సర్గోక్తులాడుకొనుచుఁ, గడు ముదంబొప్పమధువైరిఁ గ్రమ్ముకొనఁగ

సీ. స్నిగ్ధంబులై మించి చెంతలచూపులు రమణ నీలాబ్జతోరణము లనుప
*సేదనీరొగిఁ గ్రమ్మి చెన్నారు నెమ్మోము సమరందపంకజచ్ఛాయఁ బూన
ఘనవిల్లుపగ్గలఁ బోలి నవీఁపుపై వాలుచందమొందుచుఁ గీలుజడ చెలంగ
బిగువుకంచుక(ము)లోఁ బెడఁగుదిట్టమెఱుంగు జన్నుమిట్టలొకింత చలనమొంద
హారములు దూఁగఁ గా నసియాడఁ దొడఁగ
వలచునూర్పులు పెంపెక్క వళులు నిక్కఁ
గంకణధ్వను లలతాళగతుల నెనయ
శౌరితల యంటె నొక † మహోదారజఘన. ౮౪

వ. ఇట్లు యదుకుంజరుండు సాభ్యంజనుండై యొక్క కుంజరయాన కైదండ యొసంగఁ గ్రొమ్మెఱుంగు నండగొను ఘనాఘనంబునను పున ధరాధరశృంగోన్నతం బగు నవగాహనగేహంబుఁ బ్రవేశించి యొక్క మించుఁబోఁడి వలపులు గ్రించు మంచిగంధంబు‡టటకలిం బెన్నరుల నూనియ §గ్గుఁ గ్రిదగ్గఁ జేయ మఱియొక్క కొమ్మ కమ్మతావు లూరు జలంబుల జలకం బార్చ నొక్కరంగులాఁడి బంగరురంగులతెఱంగుల మరుంగుపడఁ జేయు దువ్వలువలవ యొసంగ నుత్తరాధరాంగంబుల ధరియించి కొందఱు మందయాన లమందానందంబున నెడనెడ మంగళారాత్రికంబు లొసంగ వాసంతికకుసుమవిచిత్రాస్పదంబును జంపకమాలోత్పలమాలికాభ్రమరవిలసితలసితంబును మంజుభాషోర్వశీసుముఖీమనోహరంబును నానావదార్థసమృద్ధంబును బ్రసన్నంబు నతిమధురధ్వనిసమాలింగితంబు నస్పృష్టదోషలేశంబు ననుగశాఖలాలంకారంబు నగుచు మహాకావ్యంబుతో నెక్కసక్కెంబులాడు వివాహవేదిం దా నాయకరత్నం బగుట నధివసించి కొంద ఱిందువదనలు కురుల తడియార్చి సంస్కారధూపంబు దీర్చి జలార్ద్రానిలంబులం దేర్చి సురభిళకు

*సేదనీరొని-మూ. † మోహాకార-మూ. ‡ టలకంబున- § దంగం జేయు-మూ,

సుమమాల్యంబులం జేర్చి యంతరేకాంతపరిపూర్ణతా బహిరుదీర్ణసత్త్వ గుణవైభవభ్రమంబు నవగమించు దివ్యచందనలేపనం బమర్చి యమూల్య రత్నకలాపంబులు తత్తదుచితస్థానంబులఁ గుదిర్చి యా కాళిందీముఖారవింద * దర్శనాదర్శనం బీయాదర్శనంబు దర్శింపు మనుచు మనోభవప్రతీకదర్శన ప్రదర్శితబింబప్రతిబింబైక్యంబై తద్దర్శనకుశ్చితంబు సేయం దగు ననుచు నొ రొక ముకురకపోల యొకనిద్దంపు నిలువుటద్దంబుఁ దెచ్చి ముందట నిడ నయ్యవసరంబున నచ్చంపునెలదాల్పు నబ్బాములయొకిమీనికిం బ్రాతిభ ట్యంబు వాటించి యఖండచండకిరణమండలంబు దాల్చెనో యన నలరారు మణికిరీటంబుగల శిరంబును గచప్రచయసజలజలదసరిగళన్ముక్తాఫలజాలం బుపోలిక వెలుంగు తెలిమ్రానిపువ్వులబాసికంబును దద్గంధాస్వాదనలోలు కబంభరడింభంబులవిడంబించు నలకంబులు గలయలికంబును దావితామర పువ్వును మదిఁగదురఁ బఱతెంచి కదలకనిల్చు తేఁటికూనలేమనఁ బొలుచు కమ్మకస్తురిచుక్కబొట్టుగల నెమ్మొగంబును నిజాంతేవాసులం బ్రోవ మనవి కేతెంచి కర్ణాంతికంబుల నిలుచు వేలుపుతోలువేలుపాజ్జలనుజ్జగించు నాణి సుపాణిముత్తియంబుటొంటులు గలకర్ణద్వయంబును సకలంకాపూర్వశశాం కశకలశంక నంకురింపఁజేయు వివాహనేకథ్యోచితకజ్జలబిందువు పొందుఁ గాను కపోలతలంబును గంధరాభిధానబంధురకంబునిరర్గళనిర్గళమౌక్తికమణి రాజరాజులో యనఁ బురణించునుదంచన్ముక్తాహారభేదంబులు నంతరనవకాశ బహిఃప్రకాశద్ర(వ్య)విషయకానురాగంబు పెంపుదలపించు కౌస్తుభనామ మణిసార్వభౌమంబును గలశ్రీవత్సవనమాలికామనోహరవిశాలదోరంత రంబునునవికలమణికీలితబలభిమవలస్తంభజృంభణసంభావితంబులగుచిరత్న రత్నకీలితకేయూరాంగదవిలసితభుజాద్వయంబును మణిబంధప్రభావలయం బన నలరారు మణివలయంబుల నలరుకరంబులును నిజోదరాంతరావసదనం తవనజజాండభాండస్థైర్యకార్యార్థంబనా నిబద్ధమణిమేఖలం బగు కటిప్రదే శంబులును దెలినీటియేటి † తమ్మియెమ్మి నా మగరాల తేటనీటు లుద్ఘా టించు కటకంబులు గలపదద్వయంబును గలిగి లత్ప్యాలత్ప్యపదార్థజీవితం బగునమ్మహాపురుషునకు నిట్టిసులంకార్యత యబ్రమే యనుచు వార్యులెన్న వెలుంగుచుండె నప్పుడు. వాఁ

* దర్శనంబియాదర్శనంబు. † తెమ్మి.

గీ. కంజనేత్రుండు బహుపరిష్కారయుక్తిఁ, ద్రిగుణసంబాధభవ్యగఁ దేజరిల్లు
నపుడు సప్తవ్యతితో మైత్రి నందికొనియె, నొకయెడో మతకస్తురి యుండెఁగాని.

క. మును హారునికంటిసెకలం, జెవసిన యొకమదనుఁ గనియె శ్రీకాంతుఁడు దాఁ
గన వింతపెంక్షికొను క్రై, మరుచు నసంఖ్యాకసుతమమవరులఁ గనియెఁ.

వ. అంత. ౮౮

ఉ. ఏనుపరాంఘ్రు హంసగనయామణి క్షీరపయోధిపీఠికా
వాదరదానదక్షిణత నల్లఁగు మేల్మిజిరంపురాలబ
ల్వేదిక నిల్పి నెమ్మదుటఁ బ్రేరి కొంజగిమించు నతుకల్
వాదనలేని వీణెలఁ బాటలనీటుల *ట్లు లొప్పఁగన్. ౮౯

క. ఉనుగు వెలపెన్ల దేనకి, కొను కిప్పను నీకుఁ బొంక్షికొను క్రై యమరం
గొను కగుచు నీకు మనకుం, దుడుగర లందుజను మునన కునిదా వింటే.

గీ. అనుచుఁ జెలియలు మధురోక్తు లాడుచున్నఁ
బడఁతి యొక్కర్తు మిగుల నేర్పరి సుగంధ
తైలమున వింతితల యంటి తార్చి తీర్చి
నానముడి సంఘటించెను నానముడికి. ౯౧

గీ. కులుకు ముడిగూడనిద్దంపుఁ గురులసొంపు, గుంపుగనుపట్టవఁ వ్రేళఁ గుందరదకుఁ
దాళతళ్యంబుమీఱఁగఁ దైలరసము, వలపిదిద్దినమరునికృపాణి యనఁగ.

గీ. మచ్చికంటుఁ బమోదంబు హెచ్చివచ్చి, వసుపునలుఁగార్చి నవ్వుకవ్వడఁతి మేను
దీపరయొప్పారెఁ గాఁకలు దేరి † మెఱుఁగు, జోకఁ గ్రొక్కొన్న పైఁడిశలాక యనఁగ.

చ. అలకలఁ గొప్ప మీఱు కుటిలాలకయొక్కతె దివ్యచందనా
మలకము నాన నిగ్గునడిమానఁగఁ బెట్టెను మేలుతావులం
జిలుకునవాంబుపూరములఁ జెల్వ మతొక్కతె చెమ్మమిన్నఁగా
జలక మొనర్చె నొక్కచెలి చక్కఁగ మై తడి యొత్తుచుండఁగన్. ౯౪

గీ. వనిత యొక్కర్తు మేలుమవ్వలువఁ దెచ్చి, సారెఁ గట్టఁగనవ్వాడు సూర్యజాత
నప్రసాదశరజ్జాతజలదపటల, ‡ రేజితాకార యగుచంద్రరేఖఁ బోలె. ౯౫

క. చెలియొకతె చెలువయాఁదలఁ, గలతడి యుడిగింప నొక్కకలికి సుగంధో
జ్జ్వలధూపధూమ మొసఁగెన్, జలముద్గామములు జన్యజనకము లనియో.

---

*కొలు—మూ. †మెలఁగు.పా. ‡దేజితా—మూ.

—। కాళిందిని జెలు లలంకరించుట । —

ఉ. ముచ్చటగాఁగ నొక్కచెలి మోహనగాత్రికిఁ గొప్పు దిద్దఁ గాఁ
బొచ్చము లేని మెల్వలపుఁ బువ్వులదండల గొప్పు గొప్పఁగన్
మెచ్చుగ నిల్పె నొక్కచెలమీనవిలోచన సాటి గైకొన
న్వచ్చు నరాతులం బఱప వచ్చిన కీర్తులమూర్తులో యనన్. ౯౭

చ. కుటిలములైన ముంగురులఁ గూడి మెలంగెడు కామినీమణీ
నిటలమునందుఁ గస్తురిని నచ్చెలియొక్కతె బొట్టుఁ బెట్టఁ దాఁ
గుటిలతమాన ఫాలమయి కోమలచంద్రుఁడు వంకపూనుచుం
జటిలకలంకముం గుటిలసంగతి మిక్కిలిఁ గాంచెనో యనన్. ౯౮

క. పంకజముఖి కొక నెచ్చెలి, పొంకపుసీమంతవీథిఁ బొందుగ నిలిపెం
గుంకుమచూర్ణం బహితా, తంకముగాఁ గబరి వీరతం దాల్చెనన్. ౯౯

చ. నడుము మహేంద్రనీలమణి నాయకమౌ మకరాల బొట్టుచేఁ
గడునలరారు ముత్యపుఁజొకాటపు బొట్టు నెలంత కొప్పెడున్
నికువక వీఁక నచ్చెలులు వెంబడి జాల్గొనిరా మహోభయం
బడి ముఖచంద్రుఁ గొల్చుటకు వచ్చిననింతుశశాంకుఁ బోలుచున్. ౧౦౦

గీ. కంటఁ *గాటుకఁ దీర్చె నొకలికి యొకర్తు, సరసిజాక్షికిఁ గనుదోయి †సామ్యకక్షి
దళ[illegible]నరింపఁ గోరినఁ దాదృగీక్ష, గల్గుసిద్ధాంజనముఁ బెట్టుకరణితోఁప.

గీ. ముద్దులాఁడికి నొకబోటి ముత్తియంపు, మేలిముంగర ముక్కున‡ మెఱపనొప్పె
నధరమాధుర్యమాసింప నవతరించు, చెంత మెలఁగెడునమృతంపుఁజినుకనంగ.

క. శ్రీకారసామ్య మాకృతి, నేకా దర్శప్రకాశ నేనియుఁ గలదా
జోక(ను)వీనుల(న)తులా, §కపువరత్నకుండలములు దైవాఱెన్. ౧౦౩

క. అంజనరుచితీవ్రాసిత, మంజులతరపలదపాంగమంజరి మిగులం
గంజాక్షి గండతలమున, నంజనగ్రుచిరంపుబిందు వందముఁ జెందెన్. ౧౦౪

క. అరుణాధరయరుణద్యుతి, శరణాధరసీమఘటితసమ్యగలక్తా
స్ఫురణంబుఁ గనక యొకచెలి, తిరుగన్ ఘటి(యి)ంపఁ దలఁచి తెలిసిస్నానన్

గీ. తొలఁగకుండుసువర్ణబింబువులఁ జెంది, మధురబంధంబు గాంచిసమ్మదమునించి
సాధువాగ్రీతిఁ గైకొన్నచారుకంచు,కంబులోఁ జన్నుఁగవ వ్యంగ్యగతిఁ జెలంగె

* కాటిక- † సామ్యసాక్షి-మూ. ‡ మెఱనొప్పె-మూ. § రతంపుబిందు-మూ.

చ. ఉరుకరిరాజకుంభములయుద్ధతి మానిది తజ్జయార్జిత
స్ఫురితయశస్సితంబగుచు శోభిలు దానికిఁ దద్వినిస్సర
ద్గురుతరమౌక్తికావళులఁ గూడుట యబ్రమె యంచు నెన్న న
త్తరళమృగాక్షి చన్నుఁగవ దాలిచె గంధపుఁబూత హారముల్. ౧౦౭

ఉ. నీలపురాలకాంచికయనిందితరోచులు క్రిందఁ బర్వమన్
మేలగురోమరాజిరుచి *మేచక(ముం బుట)నాభినామకా
వాలముతో మెలంగెను నవారితనీలరసంబు మించి యు
ద్వేలముగాఁ దరచ్ఛ్వసితధీ నిరువంకలఁ జేయు నింతికిన్. ౧౦౮

క. చారుకరకల్లవాంకిత, సైరాజిలు బాహులతిక సతివకు సమరేన్
హీరమయకంకణాంకులు, సారలతాంతములమేలుచాయం గనుచున్ ౧౦౯

క. మదదంతిగామినీమణి, పదపంకేరుహములందుఁ బాయక నిలిచెన్
మృదుమధురనినాదంబులు, †పాదలఁగఁ హంసకములతులపూర్ణద్యుతులన్

గీ. ‡సహావసత్ప్రతికరత నే సవతి గాదు, కంకణావాస కీశరత్నద్వయమున
నిరుపమానవేలసౌందర్యనిత్యపదత, నేవి యుల్లక్ష్మి సవతియయ్యెంచు వదన ౧౧౧

చ. ముకు(కుఁ)దనంబు(ప)క్రతయు మోయుటగాని సుసూక్ష్మవృత్తితన్
పదలుచు నృత్యతం గొనుచు హాసిపహించినఁ జిత్రరేఖ దాఁ
బొదలుచుఁ §గాత్రికతుణదఁ బూని మెలంగిన యుక్తి సాఁటిగా
మది మదమావహిల్లుఁ జెలిసుందితపేశలదేహయష్టికిన్. ౧౧౨

గీ. కమలలోచనపాణిసంగ్రహణకారి, నిరతిశయభాగ్యవర్ణాళినీటుఁ గాంచి
నలలితాకృతి ఫాలదేశంబునందు, భామ కలరారె ముత్యాలబాసికంబున్.

—। వివాహవర్ణనము ।—

క. అప్పుడు మహీసురోత్తము, లిప్పుడె సుముహూర్తవేళ యొడలే దనఁగా
రప్పించిరి తెరమటుఁగున, కొప్పులకుప్పను మొదలఁ బులొప్పులు గుప్పన్.

చ. పలితెలిపచ్చడంపుఁ దెర పర్వినవచ్చలిమోము దాఁగనే
హారినయిచోడు శారదఘనాంతరపూర్ణనిశాకరుంబలె
గలికివరాననాంబుజము గన్నుగఁ గాఁ దమకించియుం దదా
కలన ధరింపదయ్యెఁ బురుగ్రస్థుడు దట్టపుసిగ్గుబత్తెరన్. ౧౧౪

*మాగు-మూ †పాదలకణాంశకలము-మూ ‡సహావసత్ప్రతికర-మూ §కాత్రికతుణతపూన-మూ

గలసికొన నైన యవ్వింతకలకలంబు
చాల దీపించె దోయింటి ప్రాలవేళ. ౧౨౪

క. పువ్వులదోయిటికయ్యం, బవ్వసితావరుల నలరఁ *నందించెఁ గడుం
బువ్వులరువ్వులకయ్యము, పువ్వింటితునినతమ నలరఁ బొందింపఁగన్. ౧౨౫

వ. అంత. ౧౨౬

ఉ. వేలిమివేళయందు నరవిందదళాయతలోచనామణుల్
వేలిమిపాట రాగములు వింతలు వింతలుగాఁగఁ బాడ సం
దోలి నడంగె నారదముఖోర్జితస్వరగాయనప్రవే
కాళికరాబ్జసంవసదుదంచితమంజువిపంచికార్భటుల్. ౧౨౭

గీ. ఇంతిహృదయావనచ్ఛిరమేధమాన, మదనదావానలజ్వాలమద మణంగ
బహిరవిరహితవైవాహపవనమిత్ర, ధూమకీలలు మిగుల నుద్దామములుగ.

క. ఇద్దఱు వేలిమివేదిఁ, స్నిగ్ధపువజిరంపుఁబీఁట నెఱిఁగదియంగా
సద్దఱికిఁ గూర్చుండై, యిద్దఱిసంమున మరుండు సతికి వసించెన్. ౧౨౯

చ. పొగ సొగయుంగ ముద్దుచెలిపొందిక కాటుకకంటికోనలన్
దిగిమెఱుగశ్రుబిందువులు దీర్ఘరుచుల్ దలపించు నీలపుం
జిగిబిగిఁగాంచు ముత్తియపుఁజిప్పలలోవలనుండివచ్చు హే
తుగుణములై(వ)ముత్యముల దూరొనుకప్పుమెఱుంగుపొంగులన్. ౧౩౦

క. పొగ నెపమున నొకవంకకు, సొగసుల నెమ్మోము సలిపి చూచెను సపలా
పొగరుకఱచాయచూపుల, మగనితెలుపుట్లొంట్లు నీలమణులై తనరన్.

ఉ. కమ్మలవచ్చరావయిఁడికాంతులు చూపులతెల్పుకప్పులో
ష్ణమ్మడిఁ బాదపల్లవమహోజ్జ్వలకాంతులఁగూడి పంచవ
ర్ణమ్ములమ్రుగ్గుసేడ(దన)నాథునివెంటఁ బ్రదక్షిణమ్ము చో
క్కమ్ముగఁ జేసెఁ బద్మహితుగాదిలికూఁతురు నీటిచూలికిన్. ౧౩౨

మ. సనఃప్రోక్తాకైదువేళఁ బద్మముఖ యంచత్పాద మాద్యత్తరం
బునఁ బట్టింపఁగఁ గృష్ణమానసముదన్మోదాతిరేకంబునం
గనకాంగీమణి కబ్బుసౌఖ్యమహిమం గంజాస్త్రవీరాగ్రణీ
కనదేకాంతవిభుత్వవైఖరులు లెక్కల్ సేయఁగా శక్యమే. ౧౩౩

*బొందించె- మూ.

క. నీలవేణి యమునవలె, ల్బాలామణి ద్రౌపదై శౌరిపరతంత్ర(త)చే
జాలఁగొనె నడుగురుచులను, నీలోత్పల వజ్రరాగనింద యొనర్చన్. ౧౩౪

ఉ. మోదముతో సుభద్ర చెలిమద్దులగండతలంబునందు సా
మోదనిశాకకర్దమము పొందుగ నించెను నవ్వులాటకై
నీదుకపోలభాగమున నిండి తొలంకెడు తేటమిన్న యో
కా దిపు డేనొసంగు నిశకాంతులు మేలె యటన్నకైవడిన్. ౧౩౫

చ. హరినను జెక్కుటద్దమున నర్యమనందన సత్యభామినీ
విరచితసంజ్ఞ పూర్వకృతిశ్రుతమైత్రియు హెచ్చరింపఁగా
స్ఫురదరుణంపుఁ గుంకుమము పూసినఁ దచ్ఛవి యొప్పెఁ దేటి (టే)
వారుచిఁగనంగ మోము గను సద్భుతరాగము నీడయో యనన్. ౧౩౬

చ. ముసిముసినవ్వు తేటలును ముత్యపుఁ బాపటచేరు చాయలుం
బసగలముక్కుముత్తెపు జల్లిగయున్ గుమిఁగూడి ధారయై
మసలుచుఁ బోయి మింటికొన మంచిరుచిం దనరెన్ వసిష్ఠుతోఁ
బొసగెడు నైదువంగనయొఁ బుణ్యచరిత్ర మొనంగ మ్రొక్కుచున్. ౧౩౭

గీ. పురుషతల్లజు పెండ్లి సిప్పుడు భుజించు
మధురచతురాన్నములు మీఁద మనకు నబ్బఁ
జేర్చెఁ గృష్ణుని కింకొక్క పెండ్లియైన
దిరుగ నతెంచు పుణ్యంబు దీరదేని. ౧౩౮

క. అనియెన్ను చురుచులానుచుఁ, గొనకొనెనమయంబులెన్నఁగొనుఁ డాయనుచుం
దినఁదినఁగ వింతి లనుచున్, జనత తదన్నానుభూతిఁ జాలం దనిసెన్. ౧౩౯

సీ. మంచిభోజన మబ్బె మాగధక్షితిపాలసలలితపరిణయోత్సవమునందు
నవి చెప్పనటికి నంతికంటెను మేలు వెలయు కాశ్మీరేశు పెండ్లిబంతి
యాబంతికి తయేమి యుంతకు(మి)క్కిలి బంగాళపతి పెండ్లిబంతికూడు
అకూటికన యేమి యుంతకంటెను బాగు వంగేశు పెండ్లిలో వంటకంబు
అవివచింపంగ నవ్వియా యుంతకంటె, నెక్కుడై చక్కనై నాల్కసాక్కఁ జేసెఁ
* బోల్కి తెనదివారిపెండ్లిబోనమనుచు, జనులు మృష్టాన్నములఁ దృప్తిఁ గొనిరిచాల.

గీ. ప్రోలు సొరఁబడి వెడలుచుఁ బురుషచంద్రుఁ
డురుతరోజ్జ్వలమణిసౌధముతోత్తమాంగ
మభినవలతాంతవిశదంబు నగు(టఁ) బాఁప
పాన్పునగి యెను పెండిలిపాను పెక్కె. ౧౪౧

* బొల్కి చెనిడి-ము.

# కాకినాడ-పరిషత్కార్యాలయమున వెలకు దొరకు
# గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు | ... | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ... | ... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... | 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులు గారు, బి. ఏ., బి. ఎల్. ... | ... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | ... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక ... | ... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యుఁడు | ... | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ., బి. ఎల్. ... | ... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | ... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | ... | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography ... | ... | 0 | 4 | 0 |
| 18 | ప్రాస్వరంగములు-శ్రోత్రపల్లి సూర్యరావుగారు... | ... | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాసవిలాసనాటకము—రంగాజమ్మ. | ... | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయకుఁడు | ... | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము. (మొదటిభాగము) అహోబలపతి | | 1 | 0 | 0 |
| 23 | శిద్ధనాటి రెండుశాసనములు శ్రీనాథుఁడు | ... | 0 | 4 | 0 |